# సెప్టెంబరు 1993

సంపుటి : 9

సంచిక : 9

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 4-00 |
| సంవత్సర చందా | : రు. | 48-00 |
| 4 సం॥ల చందా | : రు. | 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 600-00 |
| పోషకులు | : రు. | 1,116/. |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SREE VANI PRINTERS MACHILIPATNAM


## విషయ సూచిక



ముఖచిత్రం : ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు

# అందరికీ నమస్కరించి.....

పుట్టపర్తి సంఘటనపై వ్రాసిన రెండు వ్యాసములు ( జూలై, ఆగష్టు ) ను ప్రశంసిస్తూ వందల సంఖ్యలో పాఠకుల నుండి లేఖలు వచ్చాయి వారందరికీ నా కృతజ్ఞతలు. ఇది నా ప్రతిభ ఏమాత్రం కాదు భగవాన్ సాయి సంకల్పం, వారి దివ్యాశీస్సుల అనుగ్రహ ఫలితమేనని నా విశ్వాసం. ఆ వ్యాసములలో సత్యం బహిర్గతమైనది కాబట్టే ఇన్ని ప్రశంసలు వచ్చాయని నా అభిప్రాయం బాహ్య పరిస్థితుల ప్రభావం వలన ఒక్కొక్క సమయంలో సత్యమును విస్పష్టంగా చెప్పడం కష్టమే అవుతుంది అయితే అట్టి శక్తిని, యుక్తిని భగవాన్ బాబాయే నాకు ప్రసాదించారని నా నమ్మకం యదార్థములను తెలుసుకొనకుండా చౌకబారు విమర్శనలు చేయటం, వాస్తవములను అర్థం చేసుకొనకుండా తొందరపడి వ్రాతలు వ్రాయటం, మంచిగా నడుస్తున్న వ్యవస్థలను, సంస్థలను అప్రదిష్టపాలు చేయటానికి ప్రయత్నించడం, అసూయాద్వేషములతో నిందలు మోపడం, అభాండాలు వేయడం – ఈనాడు పరిపాటైంది. ఇటువంటి అసత్య ప్రచారములను విని, చదివి ఆత్మవిశ్వాసమును కోల్పోయి అంధులైపోతున్నారు అర్భకులు. ఇది మారాలి ప్రతి ఒక్కరూ అసత్యప్రచారాలను అడ్డుకోవాలి ధైర్యంగా సత్యమును చెప్పగలగాలి. అప్పుడే అసత్య ప్రచారకుల ఆట కట్టుతుంది. ఇది చెయకుండా, ఎవరికి వారు మనకెందుకు ? అని తలవంచుకొని పోతుంటే, అసత్య ప్రచారకులు స్వైరవిహారం చేస్తారు " విన్నన్న చెప్పిందే వేదమవుతుంది " అన్నట్లుగా అట్టివారి అసత్య ప్రచారములే చలామణి అవుతుంటాయి. సత్యము తెరమరుగైపోతుంది అసత్యం విశృంఖలంగా విచ్చలవిడిగా విలయతాండవం చేస్తుంది. అసత్యమే సత్యముగా చలామణి అవుతుంది. అప్పుడు సమాజానికి తీరని హాని చేకూరుతుంది.

" భీష్ములు కాకండి ! విభీషణులు కండి ! " అని స్వామి ఒక పర్యాయం హెచ్చరించారు. అన్నీ తెలిసిన భీష్ముడు సత్యమును ధైర్యంగా చెప్పలేక పోయినాడు కాబట్టే దుష్ఫలితాల ప్రభావం అతని మీద కూడా పడినాయి. సత్యమును ధైర్యంగా రావణాసురునికి చెప్పాడు కాబట్టే విభీషణుడు బయటబడ గలిగాడు అసత్య ప్రభావం తాత్కాలికం అయితే దాని వేగం మాత్రం ఊహించని విధంగా సుడిగాలిలా ఉంటుంది. సత్యం శాశ్వతమైనది, చావులేనిది అయితే దాని వేగం నిదానం నిదానం ప్రధానం అన్నారు గదా కనుక నిజం నిలకడమీద కాని తెలియదు. సత్యానిదే అంతిమ విజయం. ఈ యదార్థ నగ్న సత్యమును తెలుసుకోలేక సామాన్యులు తికమక పడుతుంటారు అసత్యమనే మహా ప్రవాహంలో కొట్టుకొనిపోతుంటారు. " మనకెందుకులే ! " అని కొంతమంది ఒడ్డున కూర్చొని జరుగుతున్న సంఘటనలను ప్రేక్షకులలా తిలకిస్తుంటారు. ఇట్టి వారిని " అవకాశవాదులు " అంటారు కనుక మనం అవకాశవాదులం కాకూడదు అసత్యమును ఎదిరించలేని అర్భకులమూ కాకూడదు అసత్యమును ఎదుర్కొంటూ, సత్యమును ధైర్యంగా చెప్పగలిగిన ధీరులుగా తయారుకావాలి

అయితే ఈనాడు ధీరులు కరువైపోతున్నారు అర్భకుల సంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. "నాకెందుకులే" అనే మనస్తత్వము ప్రబలుతున్నది " వేషాలకు విలువిచ్చారు, మోసాలకు తల

వంచారు, మార్చలేమని, మనకెందుకని, మనసు చంపుకొని పోతున్నారే! మనుష్యులంటే వీళ్లేనా! ప్రపంచమంతా ఇంతేనా!" అన్నాడు ఒక మహాకవి. ఈ బలహీన మనస్తత్వం మారాలి. మారనంతకాలం మన గతి అధోగతే మతి తప్పుతే గతి తప్పుతుంది. మోసాలకు తల వంచటమంటే ఆత్మవంచన చేసుకోవటమే ఆత్మవంచనకు మించిన పాపం వేరొకటిలేదు ఆత్మవంచన కాదు, ఆత్మ నిగ్రహం కావాలి, ఆత్మవిశ్వాసంతో ముందుకు నడవాలి మనం నమ్మిన విషయాలను పదిమందికి ధైర్యంగా చెప్పగలగాలి. మంచిదని తెలుసుకున్నప్పుడు ఆ మంచిని పదిమందికి పంచాలి, అందించాలి, ఆనందించాలి. అప్పుడే జీవితం సార్ధకమవుతుంది

శ్రీవాణి లక్ష్యం ధనసంపాదన కాదు మంచిని గ్రహించడం, గ్రహించిన మంచిని పోషించడం, పోషించిన మంచిని పదిమందికి పంచడమే శ్రీవాణి లక్ష్యం ఇది అంత తేలికైన విషయం కాదు అందులో ఈ రోజులలో ఉత్తమ ఆశయ ఆదర్శములతో పత్రికను నడపటం బహుకష్టం ఎల్లో జర్నలిజం, సెక్స్ సాహిత్యం పరవళ్ళు త్రొక్కుతున్న ఈ రోజులలో, వాటి జోలికి పోకుండా కేవలం నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక విషయాలతో గత తొమ్మిది సంవత్సరాలు (8 సం. 9 నెలలు) గా క్రమం తప్పకుండా ప్రతి నెలా పాఠకులకు శ్రీవాణి అందించబడుతున్నది ఇది కేవలం భగవాన్ సాయి అనుగ్రహఫలితమేనని నా విశ్వాసం. ఈ సందర్భమున శ్రీవాణి పాఠకులకు ఒక చిన్న విన్నపం చేయదలిచాను. ఈనాటి పరిస్థితులలో శ్రీవాణి ఉండవలసిన పత్రికేనని పాఠకులు భావిస్తే, తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించమని మనవి చేస్తున్నాను. ఈ విషయంలో ఎవరూ శ్రమపడనవసరంలేదు. కాలాన్ని వృధా పరచనవసరంలేదు. ప్రతి చందాదారుడు కనీసం ఒక మిత్రునితో ఒక క్రొత్త చందాను చేర్పించి పంపుతే చాలు శ్రీవాణి చేసే ఈ మహా ప్రయత్నంలో ఈమాత్రం సహకారం అందించుతే చాలు. ఇది అసాధ్యమైన పనికాదు. అయితే ఇది కొంచం బాధ్యతతో కూడినటువంటిది. ఈమాత్రం సహకారం చందాదారులు అందించుతారనే ఆశతో, విశ్వాసంతో ఈ చిన్న మనవి చేస్తున్నాను.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా గారి జన్మదినోత్సవ సందర్భమున (నవంబర్ '93) వెలువడు శ్రీవాణి సంచికతోపాటు "శ్రీ సత్యసాయి శతకము" (ప్రథమభాగము) పుస్తకం ఉచితంగా చందాదారు లందరికి పంపబడుతుంది. విడిగా ప్రతులు అమ్మబడవు. చందాదారులకు మాత్రమే ఈ అవకాశము కలదు. కనుక రెన్యూవల్ చేయవలసినవారు వెంటనే చేయండి. క్రొత్త చందాలను చేర్పించి పంపండి. ఈ అమూల్యమైన 'శతకము'ను స్వంతం చేసుకోండి! ఈ అవకాశమును సద్వినియోగం చేయండి! త్వరపడండి.

ధన్యవాదములు

సదా సాయి సేవలో

కొమ్మిరెడ్డి కృష్ణమోహనరావు

సంపాదకులు

సెప్టెంబరు – 1993

# అమృతవాణి

కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

శ్లో॥ ఉపస్థితే ప్రాణహరే కృతాంతే
కిమాశుకార్యం సుధియా
ప్రయత్నాత్
వాక్కాయచిత్తైః సుఖదం యమఘ్నం
మురారి పాదాంబుజ చింతనంచ ॥

తీరా మృత్యువు దగ్గరకు వచ్చేసరికి తత్తర పడుతుంది మనుషులకు అప్పుడు ఏదో చేద్దామనుకుంటారు చేయలేరు కారణ మేమిటో తెలుసా ? మొదట నుంచి దానికి తగిన ఆలోచన, యోచన లేక పోవటమే భక్తికి వయస్సుతో పని లేదు ధ్రువుడికి వయస్సెంత ? అతడెంత మహా భక్తుడో అయ్యాడు.

చిన్నతనంనుంచే భక్తేమిటి ? పెద్దవాళ్ళం అయిన తర్వాత చూచుకోవచ్చులే అని అనుకున్నవాళ్ళ సంగతి ఆయోమయస్థితే ముందు చూపుతో ప్రవర్తించేవాళ్ళకు జాగ్రత్త పడేవాళ్ళకు ఎలాంటి భయం అక్కర్లేదు. అలాంటివాళ్ళు ఎలాగూ సన్మార్గంలోనే నడుస్తూంటారు కనుక మరణమంటే ఒక నిశ్చితమైన అవగాహన వుంటుంది అలాంటి భక్తి అనేదే యెరగని నిర్లక్ష్యంగా ప్రవర్తించినవారికిమాత్రం కొంపమునిగిందన్నమాటే

బ్రతికినన్నాళ్ళు బ్రతికాడు ముసలితనం వచ్చింది. అవయవ పాటవం తగ్గింది మరణశయ్య నెక్కించారు ఇంటి ముందు యమదూతలు వచ్చి ప్రాణాలు తీసుకు పోవటానికి బైఠాయించారు అప్పుడు చేయవలసిన కర్తవ్యం ఏమిటి ? అనేది పెద్ద ప్రశ్న ఇది ప్రతి మనిషికి సంబంధించిన ప్రశ్న సుమా !

దానికి మంచి సమాధానం వుండనే వుందనుకోండి. కాని అప్పుడు సామాన్యంగా జరిగేదేమిటో తెలుసా ? ఆ జీవి పూర్వపు వాసనలవల్ల తాను సంపాదించిన ధనాదులేమైపోతాయో అనే ఆలోచన ప్రారంభమవుతుంది పాత అలవాటు పొరపాటున కూడా వదిలిపెట్టడు తన వాళ్ళు, తన సంపాదన, తన భవనం, తన లౌకిక సుఖాదులకు దూరమౌతున్నాననే చింతతోనే వుంటాడు తప్ప కర్తవ్యమాలోచించడు. అదే ప్రారబ్ధం.

బుద్ధిమంతుడైతే అలా చేయకూడదు. చేయడు కూడాను. తాను మాట్లాడే మాటలు మరణవేళ భగవంతునికి సంబంధించిన మాటలే మాట్లాడుతాడు, లౌకిక విషయాలు ఆ మాటల్లో రావు. చేతులు మోడ్చి యెదుట భగవంతుని భావిస్తూ నమస్కరిస్తూంటాడు అతని భావనానుగుణంగా ప్రతిచోట భగవంతుడే కనబడుతాడు. అది తెలియక బంధువులు అతనికేదో సంధి అనుకుంటారు. కాదు. అదే విధంగా తన మనస్సును భార్యా పుత్ర గృహ ధనాదుల నుంచి మరల్చుకొని భగవంతుని యందే ఏకాగ్రం చేసి నిశ్చల భావనతో వుంటాడు. ఈ విధంగా మనోవాక్కాయములతో అంటే త్రికరణశుద్ధిగా పరమాత్మ యొక్క పాదపద్మాలనే చింతనచేస్తూ వుంటాడు బుద్ధిమంతుడైన వ్యక్తి. అలాంటి వానికి తత్తరపాటు వుండదు.

కనుక అంత్యకాలం ఆసన్నమైనపుడు మృత్యువుకు భయపడకుండా బుద్ధిమంతులై త్రికరణశుద్ధిగా ఆ భగవంతుని పాదారవిందాలను భక్తితో సేవిస్తే మరణ భయం ఉండదు. అంతేకాక నిత్య సుఖప్రదమైన భగవత్సన్నిధి లభిస్తుంది.





వేసవి తరగతుల ప్రసంగం

# మనస్సును అధీనం చేసుకోవాలి

— భగవాన్ సాయి దివ్య సందేశం

" పూవులందున పరిమళమే విధానకలదో
అటులనే దేవుడు కలడు
మేది చెడినట్టి కస్తూరి మృగమువోలె
వెతుకబోయెద వెంమలో వెర్రివాడా! "

ప్రేమస్వరూపులారా !

తానే దైవమైఉండి, తనలోనే దైవముండి అట్టి దైవాన్ని వెలుపల ప్రపంచంలో వెతుక ప్రయత్నిస్తాడు వెర్రి మానవుడు నిప్పుపై నివురు కప్పినట్లుగా ఈ వేరువేరు గుణములతో అనుభవిస్తూ వస్తున్నది. ఈ యొక్క అనుబంధమనేటటువంటి సంకల్పం ప్రారంభం కాగానే, ఈ సంకల్పం మనస్సుకు తడుతుంది ఈ యొక్క బంధం, అనుబంధం, సంబంధం కేవలం వివిధ రూపములలో ప్రకటిస్తూ ఉంటుంది. బిడ్డమీద ఉన్న ప్రేమ కోడలిమీద ఉండదు. కుమారునిపై ఉన్న అనురాగము అల్లునిమీద ఉండదు భార్యపై నున్న మోహము తల్లిపైన ఉండదు కారణమేమిటి ? ఈ సంబంధమనేటటువంటి సంకల్పం. మనస్సుకు తోచిన

ఆశించిన కోరికలు విఫలమైనప్పుడు ఎదుటివారి పైన క్రోధం ప్రారంభమవుతుంది. వ్యక్తుల యందు మాత్రమే కాదు. తాను కోరిన కోరికలు, తాను ఆశించిన ఆశలు నెరవేరకుండిన దైవము పైనకూడా ద్వేషం వస్తుంది. దీనికి కేవలం క్లేశమే కారణం. ఈ క్లేశములు వ్యక్తికే నష్టం.

మానవుని ఉన్నతస్థాయికి గొనిపోవునదీ మనస్సే. అధోస్థాయికి నెట్టునదీ మనస్సే. కనుక మనస్సును మనం అధీనంలో పెట్టుకుంటే, స్వాధీనంలో ఉంచుకుంటే సర్వమునకూ మనమే అధిపతులమవుతాం. మనస్సును ఆధారం చేసుకోవటం కాదు, అధీనం చేసుకోవాలి. అదే ఈనాడు మనం చేయవలసిన పని.

— బాబా

దైవత్వమును రాగద్వేషములు కప్పిఉంటున్నాయి. నివురు ఊదిన, నిప్పు కనిపించినట్లుగా, రాగద్వేషములను వేరు చేసిన, ఆత్మతత్త్వము మనకు సాక్షాత్కరిస్తుంది ఒక్కొక్కరి మనస్తత్త్వము ఒక్కొక్క విధంగా ఉంటుంది. ఒక వ్యక్తి మరొక వ్యక్తికి భర్తగాను, భార్యగాను, తండ్రిగాను, తల్లిగాను, బిడ్డగాను — అనేక విధములుగా ఈ మనస్తత్త్వము ప్రవర్తిస్తూ ఉంటుంది కాని ఈ మనస్తత్త్వమనేటటువంటిది పరిస్థితుల ప్రభావమును పురస్కరించుకొని తక్షణమే, ఈ మనస్సు యొక్క ప్రభావం కొన్ని విధములైనటువంటి అనురాగ, ప్రేమ, వాత్సల్యములతో రూపొందింపజేస్తుంది ప్రేమ, అనురాగ, వాత్సల్య, మోహములకు మనస్సే ప్రధానం. ఈ శరీరసంబంధమును పురస్కరించుకొని, ఈ విధమైన గుణములను ప్రవేశపెడుతుంది మనస్సు ఈ విధమైనటువంటి భౌతికమైన, లౌకికమైన, అనిత్యమైన, అశాశ్వతమైనటువంటి సంబంధ బాంధవ్యములచేత మనస్సు కట్టుబడి ఉన్నది దానికి కారణమేమిటి ? ఈ సంబంధ

బాంధవ్యములచేత మానవుడు దుఃఖించడానికి గాని, ఆనందించడానికిగాని, మోహించడానికిగాని కారణ మేమిటి? సమస్త విచార ఆనందములకు కూడనూ, సమస్త దుఃఖములు, విచారములకు కూడనూ ఐదువిధము లైన క్లేశములు మానవుని ఆవరించిఉంటున్నాయి.

1. అవిద్యాక్లేశము : ఈ అవిద్యాక్లేశమనగా ఏమిటి? కేవలం సంకుచితమైన భావములచేత, ఈ దేహమే నేనని భ్రమించి, నేనొక జీవుడునని విశ్వ సించి, ఈ జీవునకు, దేవునకు సంబంధం లేదని భావించి, తనకంటే దేవుడు భిన్నమైనటువంటివాడని విశ్వసించి, అనేక దుఃఖములకు గురిఅవుతున్నాడు మానవుడు. ఇది అవిద్యాక్లేశము. దీనివలన అనేక విధములైన విచారములు ప్రారంభమై మానవత్వాన్ని కించపరుస్తున్నాయి

2. అభినవక్లేశము : ఈ అభినవక్లేశమనగా ఏమిటి? సమస్త విచారములకు, ఆశలకు, భోగములకు, రాగములకు నిలయమైనటువంటిది మనస్సు కనుక ఈ మనోమూలము చేతనే, సంసారంచేత బంధించబడు తున్నాడు మానవుడు. ఈ బంధనాలకు, విచారములకు, దుఃఖములన్నింటికీ ఈ మనస్సే కారణమని తెలిసి కూడనూ, యీ మనస్సును వేరుచేయుటకు మానవుడు ప్రయత్నించలేకపోతున్నాడు మనస్సుతో బంధించ బడి దుఃఖములకు గురియైపోతున్నాడు మానవుడు. ఇదియే అభినవక్లేశము.

3. అస్థిరక్లేశము : ఇది కేవలం విషయములతో కూడినటువంటిది ప్రపంచమంతయూ విషయముల చేత కూడుకొనినటువంటిది. ఈ విషయమే మానవు నికి ఒక విషస్వరూపంగా ధరిస్తూ ఉండాలి విషయమే లేకుండిన విషసంబంధమైన సూచనలే ఉండవు విషయములను అనుభవించగోరి, విశ్వాన్ని ఆనందించ గోరి, విషయలోలుడై, వివేకమును కోల్పోయి, విచక్షణా జ్ఞానమును కోల్పోయి, విషయమే తన జీవితలక్ష్యమని భావించి, యీ విషయములచేత అనేక విధములయిన క్లేశములను అనుభవిస్తున్నాడు మానవుడు. కనుకనే దీనిని అస్థిరక్లేశమన్నారు

4 రాగక్లేశము : రాగమనగా ఏమిటి? మానవుని యందు అనేక విధములైన భ్రమలు కల్పించుకొని, ధన కనక వస్తు వాహనాదులే మానవుని లక్ష్యమని విశ్వసించి, వీటి నిమిత్తమై నిరంతరమూ తాపత్రయ పడుతూ, వీటిని అనుభవించుటకు అనేక విధములయిన శ్రమలు పడుతూ, అన్నపానాదులు మాని, నిద్రకు దూరమై, అనారోగ్యమునకు గురియై ఈ అస్థిరమైన ధన కనక వస్తు వాహనాదులను ఆర్జించే నిమిత్తమయి ప్రాకులాడుతున్నాడు మానవుడు ఇది అశాశ్వతమని తెలిసికూడనూ, వీటిని అదుపులో ఉంచక, మితిమీరిన ఆశలతో, మతిని చెరచుకొని అనేక విధములైన దుఃఖ ములకు గురి అవుతున్నాడు మానవుడు ఈ దుఃఖము లకు, విచారములకు, కష్టములకు కారణము రాగమే కనుకనే రాగద్వేషమనేటటువంటిది మానవుని క్రుంగ దీసి కుంచింపజేస్తున్నది.

5 ద్వేషము : ఈ ద్వేషమనగా ఏమిటి? ఫలాపేక్ష నిమిత్తమై, తన కోరికలను నెరవేర్చుకొనే నిమిత్తమై యితరులను ఆశ్రయించి ఆశించిన కోరికలు విఫలమైనప్పుడు, ఆ వ్యక్తుల పైన ఒక విధమైన ద్వేషం ప్రారంభమవుతుంది తన స్వార్థప్రయోజన నిమిత్తమై మానవుడు అనేక విధములయిన ఆశలను కల్పించుకొని, ఆ ఆశలు విఫలమైనప్పుడు ఎదుటివారి పైన క్రోధము ప్రారంభమవుతుంది వ్యక్తుల యందు మాత్రమే కాదు, తాను కోరిన కోరికలు, తాను ఆశించిన ఆశలు నెరవేరకుండిన దైవము పైనకూడా ద్వేషము వస్తుంది దీనికి కేవలము క్లేశమే కారణము. ఇవన్నియూ మనోవికారము యొక్క లక్షణములే. వీటివలన ఎవరికి నష్టం? ఈ క్లేశములు వ్యక్తికే నష్టము. ఈ విధములైన క్లేశములకు గురియైన మానవుడు అనేక విధములైన అశాంతులకు మూలమై, కారణమై ఆత్మతత్త్వాన్ని మరచిపోతున్నాడు, విస్మ

రిస్తున్నాడు, ఆత్మతత్త్వము తనకు వేరుగా ఉన్నదని భావిస్తున్నాడు ఈ భ్రమనే మానవునికి అనేక విధము లైన నష్టములను చేకూరుస్తున్నది ఇంతేకాదు. లోకంలో కొంతమంది నిరంతరం ఆనందంగా కనిపిస్తుంటారు కొంతమంది ఆనంద దుఃఖములతో వుండినట్లుగా కనిపిస్తుంటారు. మరికొంతమంది నిరంతరం దుఃఖములోనే మునిగి ఉంటారు కొంతమంది ఏ విచారము చేయక తన్మయతులై నిశ్చింతగా జీవిస్తుంటారు ఈ స్థితులకు కారణమేమిటి? దీనికి ప్రకృతి కారణము కాదు. మనస్సుయొక్క భావమే దీనికి కారణం

ఒక్క మానవునియందే 'మానవదేవుడు' అని ఒకడున్నాడు 'మానవ మానవుడు' అని మరొకడున్నాడు. 'మానవ దానవుడు' అని ఒకడున్నాడు 'మానవ పశువు' అని కూడా ఉన్నాడు ఈ నాలుగూ మానవుని యందే లీనమై ఉన్నాయి ఇది ఏవిధంగా లీనమయి ఉన్నాయి? వీటియొక్క ప్రభావములు ఏమిటి?

1. మానవదేవుడు: "బ్రహ్మనిష్ఠ పరో దేవః" నిరంతరమూ బ్రహ్మనిష్ఠుడై, ఆత్మలక్ష్యము చేత, యీ జగత్తును అనుభవిస్తూ, సర్వ కర్మలూ భగవత్ ప్రీత్యర్థముగా చేస్తూ, సర్వ దృశ్యములనూ భగవత్ దృశ్యములుగా చూస్తూ, అన్ని రూపములనూ భగవంతుని ప్రతిబింబములుగానే భావించి, తన జీవితమంతా కూడనూ బ్రహ్మనిష్ఠ చేతనే గడుపుతూ, ఆనందిస్తూ, తన జీవితాన్ని సార్థకం గావించుకుంటున్నాడు

2. మానవ మానవుడు: ఇతనిని "సత్య ధర్మ పరో మర్త్య" మర్త్యలోకములో ఉండినటువంటి యీ మానవుడు తాను చేయు ప్రతి కార్యమునందు కూడనూ 'సత్యం వద', 'ధర్మం చర' అనే విశ్వాసంతో సత్య జీవితాన్ని, ధర్మ జీవితాన్నిగడుపుతూ ఉంటాడు తన కర్తవ్యమే ప్రధాన లక్ష్యంగా ఉంచుకొని ఎట్టి అధికారములను ఆశించక, కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ ఉంటాడు. దయ, ధర్మము, దానము, సానుభూతి, సహనము– ఇత్యాది గుణములచేత గృహస్థ ధర్మమునందు జీవిస్తూ, సత్యధర్మములను విశ్వసించి శాంతియుత జీవితాన్ని గడుపుతూ ఉంటాడు. అతనే మానవ మానవుడు.

3. మానవ దానవుడు: 'మద్యపాన మద్యో దానవః' ఈతను త్రాగటం, నిద్రించటంలాంటి తమోగుణ లక్షణములతో కాలం గడుపుతు ఉంటాడు తన స్వార్థ స్వప్రయోజనములు లేక ఇంకొకరి ఆనందమునకు ఏమాత్రం పాటుపడడు దయాదాక్షిణ్యమనేటటువంటిది శూన్యమై ఉంటుంది విచక్షణా వివేకములు అతనిలో ఏమాత్రం వికసించవు పరులను నిందించడం, బాధించడం, దూషించడం– ఇట్టివారి స్వభావం పరులను బాధించడంలోనే ఆనందించుతాడు గాని, మరొక దానిలో అతనికి ఏమాత్రం ఆనందం ఉండదు. సత్పురుషులను, మహాపురుషులు, ధర్మవీరులను చూచినప్పుడు అతనికి అనేక విధములైన ద్వేషము, అసూయలు కలుగుతాయి. ఇలాంటి సమస్త దుర్గుణముల చేత, దురాలోచనలచేత నిండిన మనస్సు కలిగినటువంటివాడే మానవ దానవుడు.

4. మానవ పశువు: ఇట్టివాడు నిరంతరమూ ఇంద్రియ సుఖములనే ఆశించి పుట్టిన మొదలు గిట్టేంత వరకు ఇంద్రియములచేతనే తన జీవితమును అంత్యము గావించుకుంటాడు. పశువువలె తినటం, ఇంద్రియ సుఖములను అనుభవించడం, తన స్వార్థ స్వప్రయోజనముల యందేలక్ష్యమునుంచుకొని కాలమును వ్యర్థం చేసుకుంటుంటాడు పశువులకైనా ఒకవిధమైన Season, Reason ఉంటుంది గాని ఈ మానవ పశువుకు Season లేదు, Reason లేదు. కనుకనే ఈ "మానవ పశువు" అనేటటువంటివాడికి జీవితం లోపల ఏ పవిత్రతగాని, ఏ ధర్మముగాని ఏ న్యాయముగాని ఏమాత్రం అతని హృదయానికి సోకదు వీటన్నింటికీ కారణం మనస్సు ఈ మనస్సును సరియైన రీతిలో అర్థం చేసుకున్నప్పుడు

జీవితమే సార్థకమవుతుంది సార్థకం కాకుండా పోవటానికి ప్రాకృతమైన చింతలే మూలకారణం

మానవత్వంలో దివ్యత్వమనేటటువంటి పవిత్రమైన శక్తి ఉన్నదనేటటువంటి సత్యాన్ని మొట్టమొదట విశ్వసించాలి. కనుక పరిపూర్ణమైనటువంటి యీ ప్రపంచమందు, పరిపూర్ణమైనటువంటి జీవితాన్ని మనం అనుభవించాలి కంటికి కనిపించేది, తనువును కదిలించేది, మనసును మురిపించేది, మనుగడను వెలిగించేది - ఈ భౌతిక ప్రపంచమే. ఈ పార్థివమైన ఈ ప్రపంచమునందు అపార్థివమైన దివ్యత్వము కూడా ఉంటున్నది ఈ పార్థివ అపార్థివములు రెండూ కూడనూ ఒక్కటే ఒకే సచ్చిదానందము యొక్క అంశములే. పరిపూర్ణమైనటువంటి బ్రహ్మత్వమునుండియే ఈ పరిపూర్ణమయినటువంటి ప్రకృతి కూడా ఆవిర్భవించింది ఈ పరిపూర్ణమయినటువంటి ప్రపంచము నుండియే పరిపూర్ణమయిన జీవితం పుట్టినది. ఈ పరిపూర్ణమయిన జీవితం నుండి, శరీరమును వదిలిన తరువాత కూడనూ మిగిలినదంతయూ పరిపూర్ణత్వమే దీనిని పురస్కరించుకొనియే ఉపనిషత్తులు

" ఓం పూర్ణమదః, పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మేవావ శిష్యతే. "

అదియూ పూర్ణము, ఇదియూ పూర్ణము, పూర్ణమున ఉదయించు పూర్ణము. పూర్ణమున పూర్ణంబుచేసినపూర్ణమే మిగిలినదీపూర్ణమే, ఉన్నదీ పూర్ణమే చేసినదీ పూర్ణమే, మారినదీ పూర్ణమే సర్వమూ పూర్ణమే. అనగా సచ్చిదానంద స్వరూపమే. ఇట్టి సత్, చిత్, ఆనందస్వరూపమయినటువంటి మానవత్వాన్ని, మానసిక సంకల్పముల వికారములచేత అనేక విధములైన క్లేశములకు గురి అవుతున్నాడు మానవుడు. మానవ మానవుడుగా అనుభవించడమే మధ్యమమయిన జీవితం. మానవ దేవుడుగా అనుభవించడమే ప్రధానమయిన జీవితం కనుక ఈనాటి మానవుడు మానవత్వంగా అనుభవించక కేవలం పశుత్వంగా జీవిస్తున్నాడు దీనికి కారణమేమిటి ? రాగద్వేషములే ఈ రాగద్వేషములకు కారణం ? మనస్సే. ఈ మనస్సు ఆశించినటువంటి సుఖములకు విరుద్ధం కావటంచేతనే రాగద్వేషములు సంభవిస్తున్నాయి.

మానవుడు కేవలం దుఃఖస్వరూపుడు కాదు కేవలం ఆనందస్వరూపుడూ కాదు ఈ సుఖదుఃఖములకు ఏది నిలయమై ఉన్నదో, ఆ సచ్చిదానంద స్వరూపుడే మానవుడు అట్టి సత్, చిత్, ఆనందతత్త్వాన్ని ప్రతి మానవుడు కూడనూ అనుభవించటానికి ప్రయత్నించాలి. ఈ విశాలమయిన ప్రపంచమునందు, విశాలమయిన భావములు పెంచుకోవాలి అనంతమయిన జగత్తునందు అల్పభావములకు అవకాశం యివ్వక అనంతభావములనే మనం పెంచుకోవాలి ఈ సంకుచితమయిన భావములను పెంచుకొని యీ సంకుచితమయిన జీవితాన్ని గడుపుతున్నాం. ఇది ఎవరి తప్పు ? యీ మనస్సును అనుసరించిన మానవుని తప్పే.

" మనసు నాధారముగ గొను మానవుండు
పశువు కంటెను హీనమై పతనమగును
బుద్ధి నాధారముగ గొను బుధజనుండు
పశుపతిగ మారునని పల్కె పర్తిసాయి "

బుద్ధి అనగా ఏమిటి? విచక్షణాజ్ఞానముతో కూడినటువంటిది. ఇది మనస్సుకు అతీతమైనటువంటిది మొట్టమొదటిది దేహము దానికి పై భాగము ఇంద్రియములు దానికంటే పైన మనస్సు. దానికంటే పైది బుద్ధి. బుద్ధికి పై భాగమున ఉన్నది ఆత్మ. ఆత్మకు అతి సమీపంలో బుద్ధి ఉండటం చేత ఆత్మ ప్రభావం, ప్రకాశం బుద్ధిపైన పడుతూఉన్నది. కనుక మనకు అతీతమైనటువంటి తత్త్వము బుద్ధి. ఈ బుద్ధిని కొంతవరకు విచారణచేసి మానవుడు బుద్ధిగా బ్రతకాలి. అప్పుడే నిజమైనటువంటి ఆత్మ

( తరువాయి వ పే )

# పరిపూర్ణ ప్రజ్ఞావంతుడు

# ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు

—————డాక్టర్ చలసాని సుబ్బారావు

'One thing well done is twice done'— అన్నాడొక ఆంగ్ల రచయిత మామూలు ధోరణిలో నిజమే ఏ పనైనా చిత్తశుద్ధితో కావాలని చేస్తే అది రెట్టింపు చేసినట్లే అవుతుంది. కారణం ఆ పని ఆశించిన దానికి రెట్టింపు ఫలితాన్నిచ్చే అవకాశముంది కనుక సేవారంగంలో నిష్ణాతులైన వారందరికీ యిందులో నమ్మకముంటుంది కారణజన్ములకిది కమనీయ స్వభావమే నిజానికి ఆలోచనల్లో నిలకడ లోపించి అత్యాశతో ఏదీ పూర్తికాకుండా పది పనులు ప్రారంభించిన వానికంటే రెండు పనులనే ప్రారంభించి వాటిని విజయవంతం చేయగలిగినవాడు ధన్యుడు గదా అతనే క్రియాశీలుడు, స్థిరసంకల్పుడు అవుతాడు అతని జీవితానికే పరమార్థం సిద్ధిస్తుంది. రాజకీయాలు కానివ్వండి, సంఘసేవ కానివ్వండి, విద్యావిషయం కానివ్వండి, సాహితీ రచనలు కానివ్వండి, పత్రికా నిర్వహణ కానివ్వండి, మరేదైనా కానివ్వండి, కృషిలో స్థిరచిత్తత, క్రమబద్ధత అనేవి లోపించని వానికే చరిత్రలో స్థానం మిగులుతుంది ఇది చరిత్ర చెపుతున్న పాఠం

జన్మ కారణంగా సంక్రమించిన కుల, మత, వంశ, వర్ణ, వర్గ, భాషాభేదాల నడ్డుపెట్టుకొని మిథ్యాభిమానంతో మానవధర్మాన్ని విస్మరించి అర్థరహితమైన ఆచార సంప్రదాయాల మధ్య మూఢనమ్మకాలతో తమ ఉనికినే మరచి పరాయి పాలన కొకప్పుడు తలవంచిన ఆధునిక భారతజాతి చరిత్రలో 19వ శతాబ్దం మనం విశేషించి గమనించ దగ్గది శతాబ్దాల పరాధీనత కారణంగా ఈ జాతి ఆత్మవిశ్వాసాన్ని, కార్యోత్సాహాన్ని కోల్పోయి నిస్పృహతో నిద్రకుపక్రమిస్తున్న రోజులవి నిద్ర పట్టక గతాన్ని పగటికలలు కంటున్న రోజులవి. వ్యాపారులుగా వచ్చిన ఆంగ్లేయులప్పటికి పరిపాలకులుగా నిలద్రొక్కుకొన్నారు ఈస్టిండియా కంపెనీవారు యీ దేశంలో కోర్టులు, కచేరీలు, పోలీసుస్టేషన్లతో పాటు పాఠశాలలుకూడ తెరిచారు ఇచ్చటి జీవితాలలో వారు తమ మతాన్ని, తమ భాషా సాహిత్యాలను ప్రవేశపెట్టేందుకు పథకాలు వేసుకొన్నారు. తాము నూతనంగా సాధించిన శాస్త్ర సాంకేతిక విజయాల నడ్డుపెట్టుకొని యిచ్చట ప్రజలను తమకు శాశ్వత విధేయులుగా రూపొందించుకొనేందుకు యత్నాలు ప్రారంభమైనాయి. అందుకు వారు స్థాపించిన ఆంగ్లభాషా విద్యాలయాలు, తలపెట్టిన వారి విద్యావిధానాలు ఒక వైపున తమ సభ్యతను, సంస్కృతిని, చరిత్రను, తమ గత సర్వస్వాన్ని తాము విస్మరించి భోగలాలసులుగా మార్చగలిగిన దేశీ విద్యావంతులను సృష్టించినా, మరోవైపున లక్ష్యహీనులై విదేశీపాలకుల ప్రలోభాలకు తలవంచక, ఆ నూతన వెలుగులో తమ గతాన్ని తాము గుర్తించి వెలికి తీయగలిగిన వివేకవంతులకు కూడ స్ఫూర్తినిచ్చాయనే చెప్పాలి. అటువంటి వారే యితరుల తప్పుల కొరకు బాధపడుతూ కూర్చోవడంకంటే సంస్కారగతంగా, జాతిగతంగా తమకు సంక్రమించిన దోషాలను ముందు సరిచేసుకొనడం భావ్యమను ధోరణిలో కృషిచేసేందుకుద్యమించిన కర్తవ్యపరాయణులు. కార్యదక్షులు జాతి చరిత్రలో - భోగపరాయణుల పేర్లు చెరిగిపోయినా కర్తవ్యపరాయణుల పేర్లు మాత్రం చిరస్థాయిగా నిలిచిపోతాయనేది నిర్వివాదాంశం వీరినే

జాతి సమయం తెటస్థపడినపుడల్లా స్మరించుకొంటూ వుండాలి

పేరు వినగానే పాండిత్యం, సంస్కారం తలపుకు తేగలిగిన పుణ్యధనుడు ఈశ్వర చంద్ర విద్యాసాగర్. ఆధునిక బెంగాలీ గద్య సాహిత్యానికాద్యుడు. ఈయన మూల నామం ఈశ్వరచంద్ర ' వంద్యోపాధ్యాయ '. బెంగాలీ భాషలో వంద్యోపాధ్యాయ అనేది " బొంద్యోపాధ్యాయ " గా ముక్తసరిగా 'బెనర్జీ'గా ఉచ్చరింపబడుతుంది " విద్యాసాగర్ " అనునది ఆయనకు ప్రభుత్వం వారి " హిందూ న్యాయ శాస్త్ర సమితి (Hindu Law Committee) ప్రసాదించిన బిరుదు మాత్రమే. ఈయన జన్మస్థలం ఈనాటి బెంగాల్‌లోని మిద్నపూర్ జిల్లాయందలి బీరసింహ గ్రామం. తండ్రి ఠాకూర్‌దాసు బెనర్జీ, తల్లి భగవతీ దేవి. తాత - ముత్తాతల నాటినుండి వీరిది సంస్కృత భాషను, ఆగమ శాస్త్రాలను అభిమానిస్తూ వచ్చిన పండిత వంశమే. ఈశ్వర చంద్రుడు 1825 లో కలకత్తాలో నెలకొల్పబడిన సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం చేశారు. సంస్కృత భాషతోపాటు వ్యాకరణం, ఛందస్సు, అలంకారం, తర్కం, వేదాంతం సాహిత్యం, న్యాయశాస్త్రం మొదలగు పలు విషయాలలో పాండిత్యం సాధించాడు అదే కళాశాలలో కావాలని మక్కువతో ఆంగ్లభాషను కూడ అభ్యసించాడు. పాశ్చాత్యుల ఆధునిక భావాలను, సంఘ సంస్కరణోద్యమాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి స్వజాతి స్థితి గతులను తెలిసికొన్నాడు

సంఘ సేవాదృష్టితో ఈయన 1841 నుండి 1858 వరకు కలకత్తా బోర్డు విలియం కళాశాల, కలకత్తా సంస్కృత కళాశాల వంటి విద్యాసంస్థలలో ఈయన అధ్యాపకుడుగా, ఆచార్యుడుగా, ప్రధానాచార్యుడుగా, కార్యనిర్వాహణాధికారిగా పని చేసి అధికారుల మన్ననలు పొందాడు. ప్రజాదరణకు పాత్రుడైనాడు. చివరకు విద్యా విధానాలలో ఏర్పడిన సిద్ధాంత భేదాల కారణంగా పదవుల నుండి తప్పుకొన్నాడు.

ఈశ్వర చంద్రుడు సంస్కరణవాది. సిద్ధాంతవాది, ఋజువర్తనుడు తానెంత సనాతనసంప్రదాయాలలో పుట్టి పెరిగినా, స్వదేశాభిమాని అయినా, ఈయన అభిజాత్యమనేది అన్యుల సుఖ స్వార్థాలకు, సంతోషాలకు అడ్డు తగిలేట్లుగా రూపొందరాదను విశాల దృక్పథం గల అభ్యుదయ మానవతావాది. సాటివారి అభివృద్ధిని సైతం హర్షించగల సంస్కారవంతుడు, ఔదార్యంగల విద్యావంతుడు. యీ కారణం వలన ఆంగ్లభాషను, ఆంగ్ల సంస్కృతిని యీయన ద్వేషించలేదు. ఆనాడు ఆంగ్ల భాషాధ్యయనాన్ని పట్టుపట్టి యిచ్చటి విద్యాసంస్థలలో ప్రవేశపెట్టించిన రాజారామమోహనరాయ్‌ని ఈశ్వర చంద్రుడు మనస్ఫూర్తిగా సమర్థించాడు. దేశభాషలకు దేశ సంస్కృతికి ఆధారభూతమైన సంస్కృత భాషతో పాటు ఆధునిక విజ్ఞానసంపదకాధారభూతమైన ఆంగ్ల భాషను కూడ మనం తప్పక చదువుకోవాలని ప్రబోధించాడు, భారతీయులు తమ పరిపూర్ణ వ్యక్తిత్వం కొరకు ప్రతి విషయంలో సమన్వయ దృక్పథాన్ని పోషించుకొనడం మంచిదని చెప్పిన మహనీయుడీయన.

ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు " ఆనో భద్రా క్రతవోయంతు విశ్వతః" - Let noble thoughts come to us from every corner of the world. అను ఆధ్యాత్మ సూక్తిని నమ్మిన విజ్ఞాని. ఆశ్చర్యకరమైన విషయమేమంటే భరతమాతానాడు తమ కాలాలకు మకుటాయమానాలు కాగల భార్యలను కనాలని తాపత్రయపడుతున్న రోజులవి. అలాగే ఆ కాలంలో ఎందరో మహానుభావులుద్భవించారీగడ్డపై. రాజా రామమోహనరాయ్ (1774-1833) తదుపరి మహర్షి దేవేంద్రనాథఠాకూరు (1817-1905) మొదలు రామకృష్ణ పరమహంస (1836-86) వరకు అనేకమంది సాహితీసంపన్నులు, తాత్వికులు, ధర్మజ్ఞులు భారతీయుల ఆలోచనా ధోరణిని సంస్కరించి పెట్టారు. ఆ మహనీయుల మణిహారంలో ఈశ్వరచంద్రవిద్యాసాగరుడొక మణిపూస. దేవేంద్రనాథఠాకూరు, కేశవచంద్రసేన్

దయానంద సరస్వతి, బంకించంద్ర చటోపాధ్యాయ, మైకేల్ మధుసూదనదత్తు, చంద్రశేఖర బసు, రాజేంద్ర లాల్ మిత్రా, భూదేవముఖర్జీ, అక్షయకుమారదత్తు, దాదాబాయినౌరోజీ వంటి పుణ్యధనులకు విద్యాసాగరుడు సమకాలికుడు. తెలుగువారి చరిత్రలో నవయుగ వైతాళికుడు వీరేశలింగం పంతులుగారు ఈయనకంటే 23 సం ల చిన్నవాడు. పోతే ప్రముఖ పాశ్చాత్యులు మాక్సుముల్లర్, కార్ల్‌మార్క్స్, ఏంగిల్సు, టాల్‌స్టాయి, జాన్‌రస్కిన్, ఇలియట్, మాధ్యూఅర్నాల్డులు విద్యాసాగరునికి సమ వయస్కులు.

ఈశ్వరచంద్ర విద్యాసాగరునికి ఆనాటి రాజకీయ రంగంతో పొత్తులేదు. ఈయన శ్రమించింది సాహితీ-సాంస్కృతిక రంగాలలో భారతదేశంలో "సతీ సహగమనం" అను అమానుషిక సంప్రదాయమొకటి రామమోహనరాయ్ కృషితో 1833 నాటి చట్టం ద్వారా నిషేధించబడిన విషయం మనకు తెలుసు. ఆ క్రమంలో బహుపత్నీప్రథ ( Bigamy ) బాల్యవివాహం, విధవా వివాహం, వివాహ విచ్ఛేదం (Divorce) అను సమస్యలపై విద్యాసాగరుడు తన దృష్టిని మళ్ళించాడు. ఆనాడు వంగదేశంలో, మరి కొన్ని చోట్ల పురుషుడు బహు భార్యలను కలిగివుండ వచ్చుననే ఆచారముండేది. అది స్త్రీజాతికి అవమానకరమని, అటువంటి ఆచారం గార్హస్థ్య జీవితానికి అనర్థదాయకమని, 'సమాన హక్కుల సిద్ధాంతం' ఆధారంగా దాన్ని రూపుమాపాలని విద్యాసాగరుడు పూనుకొన్నాడు. అలాగే బాల్యవివాహాలను నిషేధించాలని కోరాడు భర్త చనిపోయిన స్త్రీకి ఆమె కోరినట్లయితే మరు వివాహం (Re marriage) చేయడం దోషం కాదని శాస్త్రీయంగా నిరూపించాడు. అందుకొరకు ప్రాచీన స్మృతి గ్రంధాల అధ్యయనం చేయవలసి వచ్చింది. తనకు పరిచయమున్న ఆంగ్లేయులు, బ్రహ్మజ్ఞాన సమాజకులయిన కేశవచంద్రసేన్, ద్విజేంద్రనాథ ఠాకూరు, ద్వారకానాథ మిత్రా, మహేంద్రలాల్ సర్కార్, రమేశచంద్రదత్తు, రాజనారాయణబసు వంటి ఆనాటి పెద్దల సహకారంతో విద్యాసాగరుడు 1856 నాటికి గవర్నర్ జనరల్ లార్డు డల్‌హౌసీచే విధవా వివాహాన్ని చట్ట సమ్మతం చేయించాడు. తాను కోరిన స్త్రీ అభ్యుదయ సంస్కరణలన్నిటినీ వాంఛనీయాలుగా ప్రభుత్వం వారిచే గుర్తింప జేయగలిగాడు. ఆ గుర్తింపు ప్రకారం అయినవారు ఎదురు తిరిగినా తన స్వంత కుమారునికి ఒక విధవనిచ్చి వివాహం చేశాడు. కొందరు బెంగాలీ విధవరాండ్రకు తన స్వంత ఖర్చులతో పెళ్లిళ్లు జరిపించాడు.

ఈశ్వరచంద్ర విద్యాసాగరుడొక గొప్ప సంఘ సంస్కర్త మాత్రమే కాక చక్కటి పండితుడు. రచయిత, వక్త. తెలుగువారి వీరేశలింగం పంతులుగారి వలె విద్యాసాగరుడుకూడ తన ఆదర్శాలను ప్రచారం చేసేందుకు సాహిత్యాన్నాసరా చేసికొన్నాడు. ఈయన గొప్ప రచయిత, అనేక గ్రంథాలు రచించాడు. బెంగాలీ భాషలో మృదుమధురమైన గద్యశైలిని ప్రవేశపెట్టి ఆధునిక వంగ సాహిత్యంలో తనదంటూ ఒక విశిష్ట స్థానాన్ని సముపార్జించుకొన్నాడు ఈయనను కొందరు ఆధునిక వంగభాషలో గద్యరచనకు జనకుడంటారు. బేతాళ పంచ వింశతి, సీతేరవనవాస, బోధోదయ, విధవా వివాహ, వ్యాకరణ కౌముది, శబ్ద మంజలి, ఋజుపాఠి, చరితావళి, వర్ణపరిచయ, శకుంతల, ఆఖ్యానమంజరి, ఉత్తరరామ చరిత్ర, వంగేర యితిహాస, భ్రాంతివిలాస, మొదలగు 25-30 గ్రంథాల వరకు ఈయన రచించినట్లు కనబడుతుంది. అవన్నీ సాంస్కృతిక, సాహిత్యక, శైక్షిక (educational) విలువలు గలిగిన గ్రంధాలు. ఈయన ఇవి కాక మరెన్నో సంస్కృత - హిందీ గ్రంథాలను సంకలితం చేసిపెట్టాడు. వ్యాస భారతంలోని ఆది పర్వాన్ని సంస్కృతంనుండి బంగళా భాషలో కనువదించాడు. దాన్ని మహర్షి దేవేంద్రనాథఠాకూరు నడిపిన ఆధ్యాత్మ మాసపత్రిక 'తత్త్వబోధిని' లో సీరియల్‌గా ప్రచు

( తరువాయి 45 వ పేజీలో )

# గణపతి పూజ

- పునర్వసు

" ప్రథమం బాలవిఘ్నేశం
ద్వితీయం తరుణం భవేత్
తృతీయం భక్తవిఘ్నేశం
చతుర్థం వీరవిఘ్నకం
పంచమం శక్తి విఘ్నేశం
షష్టం ద్వజ గణాధిపం
సప్తమం పింగళం దేవ
అష్టమోచ్ఛిష్ట నాయకం
నవమం విఘ్నరాజస్యాత్
దశమం క్షిప్రనాయం
ఏకాదశం హేరంభం
ద్వాదశం లక్ష్మీనాయకం
త్రయోదశం మహావిఘ్నం
భువనేశం చతుర్దశం
నృత్యాఖ్యాం పంచ దశకం
షోడశోర్థ్వ గణాధిపం
గణేశ షోడశ నామప్రాత రుద్ధితః సంస్మరేత్
సర్వ కుశలం ప్రయాతి నశం శయః "

గణపతి ఏకదంతుడు, నాల్గు చేతులు గలవాడు పాశము, అంకుశము, దంతము, వరదము అను నాల్గు ఆయుధములు ధరించువాడు ఝండాపై ఎలుక గుర్తు కలవాడు ఎఱ్ఱని మేనిరంగు కలవాడు, విశాలమైన బొజ్జ కలవాడు, చేటవంటి చెవులు కలవాడు. ఎఱ్ఱని వస్త్రములను ధరించువాడు. శరీరమందంతటనూ ఎఱ్ఱని గంధము పూయబడినవాడు ఎఱ్ఱని పుష్పములచే పూజింపబడువాడు. ఈయన ఆకారమే విచిత్రముగా తోచును శిశు ఆకారముగాని, పెద్దపెద్ద లందరికంటే అగ్రపూజ్యము లందుకొనువాడు

ముఖ్యముగా వినాయకుని వలన మనము తెల్సుకోవలసినది తల్లి తండ్రుల యెడల భక్తి, గౌరవము షణ్ముఖుని, వినాయకుని భూప్రదక్షిణములు ఆచరించి రమ్మని పరమశివుడు ఆదేశించగా వినాయకుడు విధేయతతో పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి వారికి ప్రదక్షిణ మాచరించి నిలువగా ప్రమధగణాధిపత్యము పొందెను గజమునెంత సమయం చూసినా చూస్తూ వుండాలనే వుంటుంది ఆలానే వినాయకుని సందర్శనము కూడా. ఏనుగుకు అందమైనవి, యిష్టమైనవి దంతాలు భారత రచనా సందర్భంలో వేదవ్యాసులు వారు చెప్తుంటగా ఆగకుండగా వ్రాస్తున్న వినాయకుని చేతి గంటం భంగం కాగా దంతమునే విరచి గంటము చేసిన త్యాగశీలి అనగా విజ్ఞానము కొరకు దేనినైనా, ఎలాంటి దానినైనా త్యాగం చేయాలని చెప్తున్నట్లే గదా.

"ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి
తన్నో దంతి ప్రచోదయాత్ "
అనునది గణేశ గాయత్రి

" ఓం గంగణపతయే నమః " ఏకబీజాక్షర గణేశ మహామంత్రము వీటివలన ముక్తి పొందిన వారెందరో

ఒక్క వినాయకుడే గాదు ఆ పరమశివ కుటుంబమే విచిత్రమైనది అందుచేతనే భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు వారిది వసుధైక కుటుంబంగా చెప్తారు. ఎలాగ అంటే పరమశివునికి హారములు సర్పములు. వస్త్రం గజచర్మం, ఆసనం (పులి) వ్యాఘ్రచర్మం, వాహనం వృషభం (ఎద్దు).

( తరువాయి 45 వ పేజీలో )

# భక్తి దర్శనాచార్యులు

"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

## గర్గఋషి

ఈయన మన్యువు కుమారుడు. గర్గఋషికి శని, కాలయవనులని ఇద్దరు కుమారులు

గర్గఋషి హైహయ రాజవంశ పురోహితుడు హైహయరాజులు జమదగ్ని హోమధేనువును పట్టనున్నప్పుడు గర్గుడు వారికి 'కూడదని' అని హితం చెప్పాడు ఈయన హితం వినని కారణంచేతనే రాజవంశం నాశనమయింది ముచికుందునికి 'నారాయణుడు ఇరువది ఎనిమిదవ మహాయుగంలో అవతరిస్తాడు' అని ఈయన భవిష్యత్తును వచించాడు. గర్గుడు విష్ణుభక్తుడు. గర్గసంహితను వెలయించిన విజ్ఞాని "కథాదిష్వితిగర్గః" అని చెప్పిన భక్తి సూత్రకారుడు. గర్గుడు వరగోవింద కల్యాణ గాథలు శ్రద్ధగా శ్రవణం చేయటమే భక్తి అని కథా శ్రవణానికి ప్రాధాన్యం ఇచ్చిన భక్తి తత్త్వాచార్యుడు ఈయన.

ఈయన అయోధ్యలో శ్రీరామ దర్శనం చేసుకున్నాడు. సరస్వతీ నదీతీరంలో నివసించి ఖగోళ శాస్త్రంపై అంతరిక్ష పరిశోధన చేశాడు ఈయన శ్రీకృష్ణస్వామికి నామకరణోత్సవ క్రతువు నిర్వహించిన నంద పురోహితుడు కూడ ఈయన నివసించిన ప్రాంతమందు గర్గ స్రోత ప్రవహిస్తోంది ఈయన యుధిష్ఠిరునికి "విశ్వతత్త్వం" వివరించిన వేదాంత తత్త్వజ్ఞుడు ఈయన జ్యోతిశ్శాస్త్రవిశారదుడు.

ఈయన తనసంహితలో కృష్ణః శబ్దాన్ని ఇలా వ్యాఖ్యానించాడు-

కకారః కమలాకాంతః ఋకారో రామ ఇత్యపి
షకారః షడ్గుణపతిః శ్వేతద్వీప నివాసకృత్
ణకారో నారసింహోఽయం అకారోఽ
క్షరోఽగ్నిభుక్
విసర్గౌచ తథా హ్యేతౌ నర నారాయణావృషీ
సంప్రలీనాశ్చ షట్పూర్ణాః యస్మిన్ శబ్దే
మహాత్మని
పరిపూర్ణతమో సాక్షాత్తేన కృష్ణః ప్రకీర్తితః

'కృష్ణః' శబ్దంలోని క కారం కమలాకాంతుడు, ఋకారం శ్రీరాముడు, షకారం శ్వేతద్వీపంలో ఉండే షడ్గుణైశ్వర్యపతి శ్రీమహావిష్ణువు, ణకారం నరసింహస్వామి, అకారం అగ్నిని మ్రింగిన అక్షరస్వరూపుడు. విసర్గలు నరనారాయణులు -పూర్ణులైన ఈ ఆర్గురు కృష్ణునిలో కలరు. గాన కృష్ణుడు పరిపూర్ణతముడైన అవతారపురుషుడు

కృష్ణుడు, రాముడు, నరసింహుడు, శ్రీవిష్ణువు, నరుడు, నారాయణుడు ఈ ఆర్గురు పూర్ణావతారపురుషులు ఈ ఆరుగురి సమ్మేళన స్వరూపుడు కృష్ణుడు కనుక కృష్ణుడు పరిపూర్ణ అవతార పురుషుడని తాత్పర్యం.

ఈ గర్గఋషికి వాచ్నకవి అను పుత్రిక ఉండేది ఆమె మహా తపస్విని. ఆమె బ్రహ్మవాదిని

స్త్రీలకెల్ల మేటరిని-తేజోమూర్తి-
వాశాంత ని
ఖ్యాత స్ఫూర్తిని-బ్రహ్మబోధనుడ-
వాకర్ణింపు నాపలుకు-ని

## శ్రీవాణి శత సంచిక

సాయిబోధామృత సారంబుతో నిండి
జీవితసత్యాలు చెప్పునట్టి
దివ్యపురుషుల సందేశాలతో నిండి
హృదయాలకానంద మిచ్చునట్టి
విజ్ఞానవిషయాలు వింతలతో నిండి
ఆహ్లాద మందించి, అలరునట్టి
ఆధ్యాత్మికేతర ఆణిముత్యాలతో
విజ్ఞాన మందించి వెలయునట్టి
భక్తిమార్గమునందను రక్తి పెంచి
నిత్యనూతన శోభతో నిండి (వెలుగు)
బ్రహ్మరాణిలా "శ్రీవాణి" వచ్చె నేడు
భళిర! ఈ శతసంచిక భాగ్యమేమొ

— మల్కారి ఆనందరావు

...ర్ణితుండైన గురుండు మానవులకున్
విప్రోత్తముండంద్రు—నీ
చాతుర్యంబున ఈ కుమారులకు
సంస్కారంబు గావింపవే!

విష్ణు - విష్ణు శ్రీ మహావిష్ణువే. దశావతారాలు దాల్చి లోకధర్మ సంరక్షణార్థమై భక్తిప్రబోధంచేశాడు. దశావతారాలేకాక హయగ్రీవ, దత్తాత్రేయాది అనేకానేక అవతారాలు దాల్చాడు లక్ష్మిపతియై వైకుంఠవాసుడై కూడా గజేంద్రాది భక్తులను ఆపదలోవచ్చి ఆదుకొన్నాడు. నారదునికి తాతగా దాతగా జగన్నిర్మాతగా దేవ దానవ గణవిజేతగా జగన్నాటక సూత్రధారిగా సకల జీవ పాత్రధారిగా మహావిష్ణువు ప్రసిద్ధుడు అనేక సందర్భాలలో విష్ణుభక్తిని ప్రబోధం చేశాడు

ఆ విష్ణువే విష్ణుమునిగా అవతరించినాడు స్మృతి వెలయించాడు విష్ణు స్వామిభక్తి సంప్రదాయం ఒకటి నడిపించాడు

చిత్రంబులు త్రైలోక్య ప
విత్రంబులు .భవలతా లవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజన వన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్

కౌండిన్యుడు - ఈయన శాండిల్య మహర్షి పుత్రుడు. భక్త్యాచార్యుల గణ్యమానుడు తన్మయాసక్తితో భగవంతుని ధ్యానించినవాడు. ప్రేమ తత్త్వం తెలిసిన జ్ఞానవంతుడు. శాండిల్య భక్తిసూత్రాలను ప్రచారం చేశాడు.

ఆదిశేషుడు — శేషునితండ్రి కశ్యపుడు, తల్లి కద్రువ కద్రువ తన సవతియగు వినతతో విరోధ పడుతూ ఉండేది ఆమెచేత ఊడిగం చేయించుకుంటూ ఉండేది. కద్రువ సంతానం విషధరులు. వారి స్వభావాలుకూడా వక్రంగా ఉండేవి ఆ తల్లి తాను కన్నబిడ్డలనే క్రూరంగా శపించుకొన్న దుష్ట చరిత్ర. ఆమె చేష్టలు తమ్ముల వంకరనడకలు ఆయనకు నచ్చలేదు ఆదిశేషుడు అడవులలోకి వెళ్ళి తపస్సు చేసుకొంటూ విష్ణుస్మరణం చేస్తూ మునివృత్తి అవలంబించాడు. ఈయన తపోనిష్ఠకు బ్రహ్మదులు మెచ్చి "గరుడునితో స్నేహంగా ఉండు నీవేయి ఫణాలపై భూభారం వహించు" అని ఆనతిచ్చారు. ఆదిశేషుడు మహాప్రసాదంగా వారి ఆన శిరసా వహించాడు. అప్పటినుండి ఈయన వేయిపడగలపై భూమిని మోస్తూనే ఉన్నాడు. వేయినోళ్ళతో విష్ణుని స్తుతిస్తూనే ఉన్నాడు విష్ణుమూర్తి సంతోషించి శేషుని తనకు పాన్పుగా స్వీకరించాడు శేషుడు తల్పంగా ఉండి విష్ణుదేవుని పరిచర్య ఆనందంగా చేయసాగాడు దాస్య భక్తికి గుణమాహాత్మ్యాసక్తికి శేషుడు పెట్టినది పేరు.

శ్రీమహావిష్ణువు రామావతారమెత్తి రావణవధ చేయసాగితే శేషుడు లక్ష్మణస్వామిగా అవతరించి రాముని సేవించాడు. పతంజలి మహర్షి ఆదిశేషుని అంశ అని మహావిద్వాంసుల విశ్వాసం. పతంజలి భాష్యకారులలో అగ్రేసరుడు. యోగశాస్త్రంలో అద్వితీయుడు.

'జ్ఞానం కలగటానికి మంచి అవకాశంగల మనుష్య జన్మ యెత్తి ఆత్మవిద్య తెలుసుకొని శ్రీమహావిష్ణువైన కృష్ణ పరమాత్మను సేవించనివారు క్షేమంగా ఉండనూ లేరు మోక్షం పొందనూలేరు, అని ఆదిశేషుడు అందించిన ప్రబోధ.—ఈ శేషుని అంశలే సంకర్షణుడు రామానుజాచార్యులు.

బహుళవన పాదపాబ్ధి కులపర్వత పూర్ణ
సరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్ర
సహస్రఫణాళిదాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధిసాయికి
బాయక శయ్యయైన అ
య్యహిపతి దుష్కృతాంతకు డనంతుడు
నాకు ప్రసన్నుడయ్యెడున్

ఉద్ధవుడు — ఈయన దేవభాగుని కుమారుడు; వృష్ణి వంశీయుడు ; శ్రీకృష్ణదేవునకు ఆప్తసఖుడు, పరమభక్తుడు, అయిదేళ్ళ వయస్సునందే ఒక బాలునిలో కృష్ణదేవుని మధుర మూర్తిని దర్శించి తన్మయుడై పూజించి పరిచర్య చేసి భక్తిలో పరవశమైనాడు సఖ్యాసక్తి, పరమవిరహాసక్తికి ఇతడు మేటి

కృష్ణుడు ఇతని ద్వారా గోపికలకు జ్ఞానసందేశం పంపాడు, గోపికలే ఇతనికి మాధవస్వామి మధుర భక్తిని వెల్లడించారు. గోపికల అచంచల భక్తికి ఉద్ధవుడు ఆశ్చర్యపడి వారి మధురభక్తిని కృష్ణునకు వెల్లడించాడు. ఈయన జ్ఞానసారం ఎరిగిన పండితుడు అయినా జ్ఞానయోగంకంటె భక్తియోగం గొప్పదనీ, సులభసాధ్యమనీ, ప్రబోధించాడు. శ్రీకృష్ణపరమాత్మకు సంతోషంగా ఆత్మనివేదనం చేసుకున్నాడు

బుద్ధికి బృహస్పతి ఈ ఉద్ధవుడు యదు వృష్ణి వంశాలు నశించినా లోకంలో జ్ఞాన ప్రసారం కొరకు ఉద్ధవుడు చిరంజీవిగా ఉన్నాడు. జ్ఞానం బోధించుడు అని విదురుడు ఉద్ధవుని అర్థించాడు. "నన్ను కాదు. మైత్రేయుణ్ణి అడిగి తెలుసుకోండి" అన్నాడు ఉద్ధవుడు.

సిద్ధవిచారు గభీరున్
వృద్ధవచో వర్తనీయు వృష్ణి ప్రవరున్
బుద్ధినిధి నమరగురుసము
నుద్ధవుగన్ జూచి కృష్ణు డొయ్యన పలికెన్

అని భాగవతంలో ఈయన గుణాలు పేర్కొనబడినాయి.

ఆరుణి — ఈయన బ్రహ్మవేత్త అయోద ధౌమ్యుని శిష్యులలో ప్రథముడు. ఈయనను ఉద్దాలకి ఆరుణి అని కూడా అంటారు ఈయన వైదిక సద్ధర్మ ప్రవర్తకుడు

ఈయనే నింబార్కుడుగా అవతరించాడని ప్రజల విశ్వాసం రాధాకృష్ణుల యుగళ సంప్రదాయానికి మూలపురుషుడు ఈయన ఈయన భాగవతానికి వ్యాఖ్యానం వ్రాశాడు

శ్రీమతాచార్యుల తదుపరి అంతటి పేరుగొన్నవాడు ఇతడే అని కొందరి భక్తపండితుల అభిప్రాయం ◯

# త్రిశంకుడు

మల్లాప్రగడ శ్రీరంగారావు

సత్యహరిశ్చంద్రుడని ప్రఖ్యాతి గాంచిన మహారాజు తండ్రి పేరు త్రిశంకుడు. ఇతడు తన తండ్రికి బాధ కలిగించే కార్యములు చేసినందునను, గురువు యొక్క ధేనువును చంపినందువల్లను, మంత్రపూతము కాని మాంసమును భక్షించినందువల్లను మూడు విధములుగా హృదయానికి శంకువులు కల్పించినందున త్రిశంకుడని వశిష్ఠమహర్షిచే పిలువబడుచుండెను. ఇతని భార్య పేరు సత్యరథ. ఈ దంపతుల కుమారుడే హరిశ్చంద్రుడు.

ఈ త్రిశంకుడు పంచభూతాదులతో సిద్ధించిన ఈ దేహముతో స్వర్గలోకానికి పోదలచి అందుకు తగిన యాగమును చేయించుమని తన పురోహితుడగు వశిష్ఠుని ప్రార్థించెను. ఈ శరీరంతో స్వర్గ గమనం సాధ్యంకాదని వశిష్ఠుడు చెప్పగా కోపించి యాతని పుత్రులనడిగెను. వారును సాధ్యంకాదన్నారు. ఆ కోపంతో వశిష్ఠుని, అతని పుత్రులను దూషింపగా వారు చండాలుడవు కమ్మని శపించారు.

విశ్వామిత్రుని వద్దకేగి త్రిశంకుడు తన కోరికను వెల్లడించి వశిష్ఠుడు సాధ్యము కాదని పలికిన విషయం చెప్పగా విశ్వామిత్రుడు వశిష్ఠునిపై గల వైరభావంతో త్రిశంకుని సశరీరంగా స్వర్గానికి పంపించే యాగము చేయిస్తానని సంకల్పించి, యాగము నిర్వహించుటకు తన శిష్యులను, ఇతర మునీశ్వరులను ఆహ్వానించెను కాని వారెవ్వరు రాలేదు. గురు శాపముచే చండాలుడైన త్రిశంకుడు యీ శరీరంతో స్వర్గానికి పోవుట అసంభవమన్నారు. వారి మాట లెక్క చేయక విశ్వామిత్రుడొక్కడే యాగము చేసి తన తపశ్శక్తిని ధారపోసి త్రిశంకుని స్వర్గలోకానికి పంపెను.

దేవరాజైన యింద్రుడు స్వర్గలోకానికి ఇతడీ శరీరముతో రానర్హుడుకాడని త్రిశంకుని క్రిందికి త్రోసివేసెను. స్వర్గమునుండి భూలోకానికి తలక్రిందులుగా పడివస్తున్న ఆ త్రిశంకుడు విశ్వామిత్రుని ప్రార్థించి రక్షింపుమని మొరపెట్టెను. విశ్వామిత్రుడు త్రిశంకుని నేలపైబడకుండ ఆపి మరొక స్వర్గము సృష్టించెను. నీవు ఆ స్వర్గమునందుండగలవని ప్రయత్నించబోవుచుండగా యింద్రుడది తెలుసుకొని విశ్వామిత్రుని వద్దకు వచ్చి మహాత్మా! తగని పనికి పూనుకొని మీ తపస్సును వెచ్చించి మరొక స్వర్గమును సృష్టింపకుడు. భూమిపై పడకుండ త్రిశంకుడిపుడున్నచోటున ఉండనిండని ప్రార్థించెను. అటు స్వర్గరాజ్యము రాకుండ ఇటు భూలోక సామ్రాజ్యమునకు దూరమై ఉభయ లోకాలకు దూరుడై భూమికీ స్వర్గానికి మధ్య త్రిశంకుడు అలాగే ఉండిపోయెను. ఇదే త్రిశంకు స్వర్గమందురు. గురు ద్రోహికి ఉభయ భ్రష్టత్వము కలుగునని యీ కథ వలన గ్రహించి జాగరూకులమై ప్రవర్తింపవలెను.

—o0o—

"సాయి" సంకల్ప మాత్రాన జగతి పుట్టె;
జగతి లోపల శ్రీవాణి జాలువారె
ఇహాము పరముల కైవల్య మినుమడించు
సాహితీజ్ఞాన సంపత్తి సౌరభాన

— కర్రి క్రిష్ణమ్మ

వేసవి తరగతుల ప్రసంగం



# నిర్జీవమైన రాళ్ళను కాదు- సజీవమైన జీవులను సేవించు

—భగవాన్ బాబావారి దివ్యప్రబోధ

" లేతవయసునందు ఈ తరుణమునందు
యుపకులైనవారు యుక్తగతిని
చిత్తమునకు స్థిరత చేకూర్చుకున్నచో
వ్యర్థజీవుడగును వ్యథలనొందు

ప్రతి జీవిలో ఆత్మస్వరూపుడుగా ఉంటున్నాడు భగవంతుడు. కనుక ఈ దేహమనే దేవాలయంలో నివసిస్తున్న ఆత్మకు నేను నమస్కరిస్తున్నాననే అభిప్రాయం కలిగిఉండాలి. ఇది కదిలే దేవాలయం. రాళ్ళతో, సున్నంతో కట్టిన స్థిరమైన దేవాలయమునకు మనం ప్రదక్షిణ చేయటానికి బదులు సజీవమైన దేహానికి మనం ఎంతో సేవ చేయవచ్చును. నిర్జీవమైన రాళ్ళకు మ్రొక్కటానికి బదులు సజీవమైన జీవులను పోషించటానికి సేవించటానికి కృషి చేయాలి.

విద్యార్థినీ విద్యార్థులారా !

చిత్తముయొక్క నిశ్చలత్వమునకు మరియొక పేరు 'శాంతి'. ఈ శాంతి ఆత్మస్వరూపమే శాంతి పవిత్రమైనటువంటి సుగుణము. ఇది దివ్యమానవునకు ఆధారము. ఇది స్వార్థపరులను చూడలేదు నిస్వార్థుల యొక్క హృదయమే దీని నిలయం ఇట్టి నిత్య సత్యమైన శాంతిని, పవిత్రమైన ఆభరణమును, మానవుడు ఈనాడు కోల్పోయి, అనేక విధముల అశాంతికి గురి అవుతున్నాడు. ఈ దృశ్యకల్పితమైన యీ ప్రపంచం త్రిగుణాల వికారములచేతనే సృష్టించబడి, పోషించబడి సంహరించబడుతున్నది. ఈ మాయలీలా ప్రపంచమునకు ఈ త్రిగుణములే ప్రాణములు. ఈ ప్రపంచము యొక్క కార్యకలాపములన్నియు ఈ త్రిగుణాలమీదనే ఆధారపడి ఉంటున్నవి. కాని మానవుడు దుష్టగుణములైన ఈ త్రిగుణములను విశ్వసించి, కేవలం మిత్రులను గావించుకొని, తన యొక్క దివ్యమైన, ఆభరణమైన శాంతిని కోల్పోతున్నాడు

మానవుడు దుస్సంఘమునకు దూరంగా వుండుటకు ప్రయత్నించాలి. దుస్సంఘం కేవలం దుష్టత్వమును మాత్రమే అందించటమే కాదు, మానవత్వాన్ని కూడా నిర్మూలనంగావిస్తుంది, మానవతా విలువలను నిరర్థకం జేస్తుంది. ఈనాడు మానవుడు తన ఉన్నతి విలువలను కోల్పోవడం చేతనే, ఆకార మానవుడుగా నిరూపించుచున్నాడే గాని, ఆచరణ మానవుడుగా కనిపించటం లేదు. దుర్జన సంసర్గం విషపురుగుతో సమానం. శ్రీరాముడు విభీషణునితో "దుర్జనులతో సహవాసంకంటే నరకములో నివసించటమే హాయి " అన్నారు. దుర్జన సంసర్గం చేత తనలో వుండిన సద్గుణములు, సదాచారములు, సత్ప్రవర్తనలు క్షణంలో నిర్మూలనం గావించు

కుంటాడు. ఇవన్నియూ మానసిక వికారముల స్వభావములే. మనస్సు అనేక విధములైన స్వరూపాన్ని ధరించి, మానవత్వంలో ప్రవేశించి, మానవుడనే సార్థకనామాన్ని నిరర్థకం చేస్తున్నాది. దుర్జనుని మాటలు అతి మధురంగా ఉంటాయి. మాటలందు మాత్రమే మధురం గాని, మనస్సంతా విషపూరితం కాని మానవుడు వాడు కాదు

" చెప్పు మాటలకును చేసెడి చేతలకును
సంయమున్నదివాడే మానవుండు
మనసులోని మాట మాటలో క్రియలో
చేతలందు చేర్చి చేరు మనిషి "

మనసు, మాట, చేయి - ఈ మూడూ ఏకం కావాలి. ఇవియే మంచివారి యొక్క సుగుణములు అతనే నిజమైన మానవుడు. The proper study of mankind is man. కనుక ఈనాటి యువకులైన మీరు దివ్యమైన భావాలు పెంచుకొని, నవ్యమైన గుణములను చేర్చుకొని, పవిత్రమైన క్రియలలో పాల్గొని ఆదర్శవంతమైన జీవితాన్ని అందించాలి. దుష్ట సంబంధమనేది వ్యక్తులతో కూడినంతమాత్రముననే కాదు, దుష్ట భావములను చేర్చుకోవటం కూడా దుష్టసంబంధమే. అహంకారం, ఆడంబరం, అసూయ, అసత్యం ఇత్యాది దుష్ట భావములు కూడా హృదయంలో చేర్చుకోవటానికి విద్యార్థులు ఏమాత్రం ప్రయత్నించకూడదు దుష్ట భావములు మానవునికి ప్రధానమైన శత్రువులు ఈ శత్రువులను పూర్తిగా నిర్మూలనం గావించినప్పుడే మానవత్వం రాణిస్తుంది కనుకనే శత్రుశేషం, అగ్నిశేషం, ఋణశేషం, రోగశేషము పూర్తిగా లేకుండా చేసుకోమని బోధించింది వేదాంతం ఈ నాల్గింటిలో ఏది ఏ కొంచం మిగిలినా తిరిగి పెరిగి మానవుని హరించివేస్తుంది. కనుక ఈ నాల్గింటిని పూర్తిగా నిర్మూలనం గావించుకున్నప్పుడే మానవునికి శాంతి చేకూరుతుంది. శాంతి అనగా ఏమిటి ? ఈ మూలాధారమైనటువంటి సత్వ రజో తమో గుణములు అణచుకున్నప్పుడే శాంతి మనలో ఆవిర్భవిస్తుంది. ఈ మూడు గుణములపైన విరక్తి, ఉపేక్ష, అనాసక్తి - ఈ మూడింటిని మనం పెంచుకోవటానికి ప్రయత్నించాలి ఈనాడు లోకములో సర్వ పదార్థములు కూడనూ భయమును చేకూర్చుచున్నవే గాని ఒకటి మాత్రమే అభయాన్ని అందిస్తున్నది ఆదియే వైరాగ్యము. వైరాగ్యములో భయం ఏమాత్రం ఉండదు రాగము కలిగినటువంటివానికే ఈ భయభ్రాంతులు ఎందుకు ఈ భయం చేకూర్చుచున్నది? ఇది రాగముగా ప్రారంభమై రోగముగా రూపొందుతున్నది. కనుక కామక్రోధములనేటటువంటివి చిన్న చిన్న అలలుగా వుండినప్పుడే దానిని అణచివేయటానికి ప్రయత్నించాలి వాటిని మొదట్లో అలక్ష్యం చేసినచో అవి క్రమక్రమేణా ఒక సముద్రంగా రూపొందుతుంది మొక్కగా వంగనప్పుడు చెట్టయిన తరువాత వంగుతుందా ! అంటారు మొక్కగా వున్నప్పుడే దానిని సరియైన మార్గంలో ప్రవేశపెట్టాలి. పెరిగి పెద్ద వృక్షమైన తరువాత దీనిని ఏమాత్రం అదుపులో పెట్టలేం. కనుకనే లేతవయసులోనే నీ చిత్తమును కొంతవరకు అదుపులో పెట్టుకొనుటకు ప్రయత్నించేయాలి ఆదియే నిజమైన విద్యా విధానం

విద్య అనగా ఏమిటి ? జ్ఞానము అనుకుంటారు. కాదు...కాదు... చిత్తమునకు శిక్షణ (Training) యివ్వటమే విద్య ఎన్ని విద్యలు నేర్చినా ఎంతటి మేధాశక్తిని సంపాదించినా, ఎంత ఉన్నతస్థాయిని సాధించినా, చిత్తము కనుక స్వాధీనంలో లేకపోతే ఈ జీవితమంతా వ్యర్థమైపోతుంది కనుకనే

" ఆత్మశుద్ధి లేని ఆచారమదియేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధి లేని శివపూజలేలరా "

అన్నారు కనుక మొట్టమొదట మనకు చిత్తశుద్ధి గావించుకోవాలి దుర్భావనలు, దురాలోచనలు, దుశ్చింతనలు మనలో ప్రవేశించకుండా చూచుకోవాలి. మనమున్న గదిలోపల విషపురుగు సంచరిస్తుంటే మనం

శాంతితో జీవించగలమా? కాదు... కాదు... దానిని పట్టి బయటకు పంపించనయినా పంపించాలి లేక దానిని కొట్టి దాని ప్రాణమైనా తీయాలి. కనుక చిత్తమనే విష పురుగునుకూడా మన హృదయమునుండి దూరంగా విడిచు కోవటానికి ప్రయత్నం చేయాలి ఈనాటి యువకులు చిత్తమంటే ఏమిటో? హృదయమంటే ఏమిటో? మనసు అంటే ఏమిటో? మనిషి అంటే ఏమిటో? తెలుసుకోలేక పోతున్నారు. ఎవరు ఈ మనిషి? మనసు కలవాడే మనిషి మనసు అంటే ఏమిటి? సంకల్ప వికల్ప ముల స్వరూపమే మనసు సంకల్పం ఎట్టిదో మన ప్రవర్తన అట్టిదిగా ఉంటుంది సత్సంకల్పములు అభివృద్ధి గావించుకున్నప్పుడు మన నడతలు దానినే అనుసరిస్తాయి. మన హృదయం పవిత్రమయినదై నప్పటికినీ, దుస్సంఘంచేత అనేక దుర్గుణములు మనలో ప్రవేశిస్తాయి. ఇది బొగ్గు, ఇది నిప్పు విడివిడిగా ఉంటే బొగ్గు బొగ్గుగానే, నిప్పు నిప్పుగానే ఉంటుంది. ఈ రెంటిని దగ్గరికి చేర్చినప్పుడు యీ బొగ్గులోవున్న అంధకారం పోయి, ప్రకాశం అందులో ప్రవేశిస్తుంది అయితే ఎంతవరకు ఇది ప్రవేశిస్తుంది? యీ నిప్పుతో ఎంతవరకు కలిసివుంటుందో అంతవరకే యిది నిప్పుగా మారుతుంది అయితే పైన ఫ్యాన్ వేసినప్పుడు బొగ్గు, నిప్పు రెండూ ఒకటైపోతాయి దీనినే 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అన్నారు. సత్సంగమునందు యీవిధమైన సద్భావనలు ఏర్పడు తుంటాయి సత్సంగమునకు సమీపుడు కావాలి. సమీపుడైనంతమాత్రమునే చాలదు. సత్సంగాన్ని ప్రేమించాలి Near (దగ్గర) కావటమే కాదు Dear (ప్రియమైన) కావాలి. Near & Dear గా వుండినప్పుడే 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అవుతుంది దుస్సంఘమునకుకూడా ఆ విధంగానే జరుగుతుంది ఒక పుష్పమును చేతిలో పెట్టుకున్నాం. ఆ పుష్పములో సుగంధమే వుంటుంటే, ఆ సుగంధం మన చేతులకు, వస్త్రములకు మరియు మన ఇంటిలోను ఆ సుగంధం ప్రవేశిస్తుంది అదియే పుష్పము దుర్గంధ ముగా వుంటే, ఆ దుర్గంధం సర్వత్రా వ్యాపిస్తుంది కనుక మంచి చెడులు రెండూ యీ విధంగా ప్రసరింప చేసే శక్తి కలిగివుంటాయి నీవు దుష్టుడవైనావంటే దుస్సంగమమే దీనికి కారణం నీవు ఎలాంటివాడవో చెప్పాలంటే నీ చుట్టూ వుండే సంఘమెలాంటిదో తెలుసు కుంటే చెప్పవచ్చును కనుకనే ఐన్‌స్టీన్ చెప్పాడు. "Tell me your company, I shall tell you what you are" కనుక మనయొక్క మంచిచెడ్డలు మన చుట్టూ వుండే సంఘము వలననే ఏర్పడుతున్నాయి.

"భుజబలంబు మంచి బుద్ధి బలంబుండి
దైవబలము లేక దాసుడగును

## సత్యమైన మాట సాయి మాట

మనసు, మాటలోనే ఉంది
మనిషి సుఖదుఃఖాలు
మనసు, మాట మంచిదవ్వాలిరా
సత్యమైన మాటరా సత్యసాయిమాట
ఆడంబరాలు ఆరని మంటలయినాయి
ఆ మంటలు చల్లార్చటానికేను
లంచాల, మంచాలెక్కుతున్నారురా
సత్యమైన మాటరా, సత్యసాయి మాట
ఆందోళనలోను ఆరాటాలలోను
అలజడుల భయాలలోను
అగ్నిని మించిన మంటలున్నాయిరా
సత్యమైన మాటరా సత్యసాయిమాట

— రాజ్యలక్ష్మి రంగారావు

"కర్ణునంతటివాడు కపటి కేమయ్యె
మరచిపోకుమిట్టి మంచిమాట"

కర్ణుడు మహాబలశాలి, మహాబుద్ధిమంతుడు. విద్యాశక్తి సంపన్నుడు దుష్ట సంపర్కముచేతనే, దుర్మార్గులైన దుర్యోధన, దుశ్శాసనుల సహవాసముచేతనే, దైవాన్ని విస్మరించి, దుస్సంఘాన్ని విశ్వసించి దుష్టచతుష్టయంలో ఒకడైపోయినాడు దైవమును దూరంగావించుకున్నాడు దైవబలముండినప్పుడే సర్వబలములూ చేకూరుతాయి కాని యీనాడు అట్టి దైవబలమును దూరం గావించుకుంటున్నారు యీనాటి విద్యార్థులు దుష్టబలమును పెంచుకుంటున్నారు. దుష్ప్రవర్తనలో సంచరిస్తున్నారు. ఇదికాదు మానవుని యొక్క ప్రకాశము. ఇదికాదు మానవుని యొక్క విశిష్ఠత.

దివ్యత్వాన్ని పెంచుకొనే స్థితిలో మానవుడు అభివృద్ధి కావాలి శాంతి... శాంతి... అంటారు ఈ శాంతి మనకు ఎప్పుడు చిక్కుతుంది? యీనాడు ప్రతి సభలో శాంతి కావాలి... శాంతి కావాలి ... అని తీర్మానాలు చేస్తున్నారు కాని శాంతి ఎక్కడ ఉన్నది?

"హస్తమున అణుబాంబులుంచుక
అరచుచుంద్రు శాంతి శాంతి యని
చంద్రు చేకలిగి కూడను
చెందజాలరు శాంతిసుఖములు"

ఏమిటిది? దుర్మార్గమైన దుష్టభావములను హస్తమునందుంచుకొని శాంతి... శాంతి... అంటే ఎట్లా చిక్కుతుంది శాంతి? దుష్టగుణములను విసర్జించినప్పుడే శాంతి మనలో ప్రవేశిస్తుంది కనుక మొట్టమొదట వ్యక్తి శాంతిస్వరూపాన్ని పొందాలి దుష్టగుణములను దూరం గావించుకోవాలి వ్యక్తి శాంతిమయమయినప్పుడే గృహముకూడా శాంతిమయంగా అవుతుంది కనుక మొట్టమొదట వ్యక్తియొక్క శాంతిని గృహంలో ప్రసరింపజేయాలి గృహములంతా శాంతిగా వున్నప్పుడు యీ శాంతిని గ్రామంలో ప్రవేశపెట్టవచ్చు. గ్రామములంతా శాంతిమయంగా ఉండినప్పుడు రాష్ట్రమంతా శాంతిమయమవుతుంది. రాష్ట్రములన్నీ శాంతిగా ఉన్నప్పుడు దేశం శాంతిస్వరూపాన్నే ధరిస్తుంది కాని యీనాడు ఇట్టి శాంతిని విశాలవ్యాప్తిగా ప్రసరింపజేయటానికి పూనుకోవటంలేదు. వ్యక్తికి అశాంతి కలుగుతే ఇంటినంతా అశాంతిమయం చేస్తున్నాడు. ఆ ఇల్లు అశాంతిమయం అయినప్పుడు గ్రామమంతా అశాంతిమయంగా కనిపిస్తుంది. ఈనాటి విద్యావంతులు కేవలం అశాంతిని ప్రసరింపజేస్తున్నారే గాని, శాంతి సుఖములను ప్రసరింపజేయటానికి తగిన కృషి చేయటంలేదు ఈనాటి విద్యార్థులు భావిభారతోద్ధారకులు. కనుక యీనాటి విద్యార్థులు శాంతి భద్రతలకు కంకణం కట్టుకోవాలి దేశం యొక్క మంచిచెడ్డలన్నీ విద్యార్థుల తలవ్రాతపై ఆధారపడిఉంటున్నది. కనుక యీనాటి విద్యార్థులు మనస్సును అదుపులో వుంచుకొని, సత్యభావములను అభివృద్ధిపరచుకొని, నిత్యజీవితంలో తన వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటూ పోవాలి. విద్యార్థులకు కర్తవ్యమే ప్రధానమైన ధర్మము. కాని యీనాటి విద్యార్థులు కర్తవ్యాన్ని విస్మరిస్తున్నారు.

మానవునకు అధికారమనేటటువంటిదే లేదు. ఈ అధికారమనేటటువంటిది మనకు మనమే పంచుకుంటున్నాము గాని, మానవునికి కర్తవ్యమే ధర్మము అదియే నిజమైనటువంటి యోగము కనుకనే 'కర్తవ్యం యోగముచ్యతే' అన్నారు కర్తవ్యాన్ని విస్మరించి అధికారాన్ని విశ్వసించి, మానవత్వాన్ని పెడమార్గాన పట్టిస్తున్నారు. కాదు ... కాదు ... మన కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించుకుంటూపోతే అధికారం మనల్నే వరిస్తుంది Rights (హక్కులు) Responsibilities (కర్తవ్యము) రెండూ పక్షికి రెండు రెక్కలవంటివి. రథమునకు రెండు చక్రములవంటివి. మానవ జీవితానికి ఆధారమైన ధర్మసూత్రములు, కనుక ఈ రెండూ

ఉంటుండాలి. కాని ఈనాడు Responsibility (కర్తవ్యం) అనే రెక్కలను త్రెగగొట్టారు. కర్తవ్యాన్ని పూర్తిగా విస్మరిస్తున్నాం కేవలం Rights (హక్కులు) కోసం Fight (పోరాడుట) చేస్తున్నాం ఇది కేవలం అధర్మయుద్ధమే. కర్తవ్యాన్ని నిర్వర్తించకుండా కేవలం హక్కులకోసం పోరాటం చేసే అధికారమే నీకు లేదు మొట్టమొదట నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు ఏమిటి ఈ కర్తవ్యం? మానవత్వాన్ని సమాజ స్థితి వరకు తీసుకొనిపోవాలి. నేనూ, నా కుటుంబం అనే సంకుచితమైన మార్గంలోనే నిలిచిపోరాదు. ఈ నడక సమాజంవరకు సాగాలి సమాజం నుంచి దేశంలో ప్రవేశించాలి. అప్పుడే మన మానవత్వమును సార్ధకం చేసుకొనినవారమవుతాం. "శరీరమాద్యం ఖలుధర్మ సాధకమ్" ధర్మసాధనలో మనం ప్రవేశించాలి శరీరం ఎందుకోసం వచ్చింది? కర్మాచరణ నిమిత్తమై వచ్చింది. అందువలననే బుద్ధుడు కూడా చెప్పాడు "బుద్ధం శరణం గచ్ఛామి" మొట్టమొదట నీవు బుద్ధికి Surrender (లోబడిపోవుట) కావాలి ఈ బుద్ధిని పవిత్రమైన చిత్తంగా మార్చుకోవాలి. అప్పుడే నీవు బుద్ధిమంతుడవవుతావు ఈ బుద్ధిని సరియైన మార్గంలో పెట్టుకున్న తరువాత "సంఘం శరణం గచ్ఛామి" ఈ బుద్ధిని సంఘములో ప్రవేశపెట్టాలి ఈ సంఘమును సమాజమును చక్కగా తీర్చిదిద్ది తరువాత "ధర్మం శరణం గచ్ఛామి" ఈ సమాజమును ధర్మమార్గంలో ప్రవేశపెట్టాలి మొదటిది బుద్ధి, రెండవది సమాజము, మూడవది ధర్మం "శరీరమాద్యం ఖలుధర్మ సాధకం" ధర్మములో ప్రవేశించాలంటే దీనికి ముందుగా కర్మములో ప్రవేశించాలి. కనుకనే ఉపనిషత్తులలో ఈ కర్మకు ప్రధానమైనస్థానం యివ్వబడింది. దీని అంతరార్థమేమిటి? మన ధర్మమంతా కూడనూ కర్మమయంగా ఉంటుండాలి "యదో వాచో బ్రహ్మ జిజ్ఞాస" అని ఉన్నది బ్రహ్మజిజ్ఞాస కావాలంటే ముందుగా మనం ఏమి తయారుచేసుకోవాలి?

# సంస్కృతి అమృతమయం

విరిసిన మందారంలో
కురిసిన మకరందం సంస్కృతి.
పరిమళించిన పారిజాతంలో
పులకరించిన పరాగ రేణువు సంస్కృతి.
నిర్మల భావ తరంగాల పరిష్వంగంలో
నీలాకాశపుటంచుల్ని చుట్టి
మధుర మనోహర స్వరపల్లకిలో
హృదయ రాగాన్ని ఆవిష్కరిస్తుంది.
చల్లని పండు వెన్నెలలో
మల్లెలు గుభాళించిన మలయ మారుతంలో
అనురాగాన్ని అంతరంగంలో చిలుకొని
అమృత సింధువై పొంగిపోతుంది.
కనురెప్పల కాంతి వర్ణాల మధ్య
కమనీయంగా నర్తిస్తున్న దృశ్యాలను
మౌనగీతాలలో వొదిగిన సత్యాలను
రూపకల్పన చేసే విచిత్ర శిల్పి సంస్కృతి
నిరంతర హృదంతరాళాల్లో
ప్రవహించే రహస్య జీవధారల్లో
ఆలోచనల స్నిగ్ధ సౌందర్యాన్ని
అద్దంలా ప్రతిబింబించే అస్తిత్వం సంస్కృతి
ఆశా నిరాశల మధ్య
అల్లాడిపోతున్న జీవన కలశాన్ని
మిథ్యా ప్రపంచపు భవిష్యజ్జీవనానికి
దివ్య నవ్య వెలుగుతోరణంగా మలుస్తుంది
విశ్వజనీనతను సంతరించుకున్న సంస్కృతి
విశ్వంభర విలాసమై వెలుగుతుంది!
రేపటి పచ్చని మైదానంలో
రేకులు విప్పిన పచ్చని మొలకౌతుంది!!

– సి. కామేశ్వరరావు

ఈనాడు నీవు పెండ్లికి పోవాలనుకున్నా, సినిమాకు పోవాలనుకున్నా ఇష్టం నుంటే వెళ్ళుతావు, లేకపోతే కాన్సిల్ చేసుకుంటావు యీ కార్యక్రమాలన్నీ వాయిదా వేసుకోవచ్చును. లేకపోతే కాన్సిల్ చేసుకోవచ్చును. కాని అంత్య ప్రయాణానికి నీవు ఏ విధంగా సిద్ధం చేస్తున్నావు?

" యా చింతా భువి పుత్ర మిత్ర భరణ
వ్యాపార సంభాషణే
యాచింతా ధనధాన్య భోగయశసే
లాభే సదా జాయతే
సా చింతా భువి నందనందన పద
ద్వంద్వారవిందే క్షణే
కా చింతా యమరాజ భీమసదన ద్వార
ప్రయాణే ప్రభో "

ప్రాకృత సంబంధమైన విషయములు సాధించే నిమిత్తమై నీవు ఎంత శ్రమ పడుతున్నావు? ఎన్ని బాధలు అనుభవిస్తున్నావు? ఎన్ని విధములైన ప్రయత్నాలు చేస్తున్నావు? ఎంత కాలాన్ని వ్యర్థం చేస్తున్నావు? కాని భగవంతుని చింతన చేయటానికి రెండు నిముషాలైనా వెచ్చిస్తున్నావా? ప్రాకృతమైన, అనిత్యమూ, అశాశ్వతము అసత్యమైనటువంటి యీ జగత్ వ్యవహారములయందు మాత్రమే మనకాలమును, కర్మను, కాయమును అంకితం చేస్తున్నాం.

విద్యార్థులారా! ఈ జీవితం క్షణభంగురమైనటువంటిది కాదు దీర్ఘ ప్రయాణము (Long Journey) దేహాలు మారినా జీవుడు మారటంలేదు ఈ దేహములనే వస్త్రములను విడిచిపెడుతున్నావు మార్చుకుంటున్నావే గాని నీ జీవిత ప్రయాణం మాత్రం నిలిచి పోవటంలేదు. సాగిపోతూనే ఉన్నది ఈ దీర్ఘ ప్రయాణం సులభంగా సాగాలంటే మనం ఏంచేయాలి? Less luggage more comfort make travel pleasure. ఈ Luggage ఏమిటి? Disers కోరికలే ఈ Luggages కనుక మనం కోరికలను తగ్గించుకోవాలి అవసరమైన కోరికలు ఉండవచ్చును మితిమీరి పోవటంచేతనే అశాంతికి గురి అయిపోతున్నారు మానవుడు ఆశలను అదుపులో ఉంచుకోవాలి. నీ జీవితానికి అవసరమైన ఆశలు పెంచుకోవచ్చును తప్పులేదు, దురాశలుగా మారకూడదు.

శంకరులవారు కూడా చెప్పారు.

" తగదు తగదు ధన దాహము నరుడా!
కర్మ ఫలితమే కదయా విత్తము
కలిగినంతలో కదరా తృప్తి
హరిగోవిందా! హరిగోవిందా!
అనరాబంధా! "

మనం ఏమి చేస్తున్నాం? "డుకృఞ్ కరణే ... డుకృఞ్ కరణే" అని ఒక పండితుడు ప్రచారం చేస్తున్నాడు అతని దగ్గరికి వెళ్ళి యిది చెప్పాడు.

1) " భజగోవిందం భజగోవిందం
2) గోవిందం భజ మూఢమతే
3) సంప్రాప్తే సన్నిహితేకాలే
4) నహి నహి రక్షతి డుకృఞ్ కరణే "

అంత్యసమయంలో ఏ గోవిందుడు నీకు అడ్డం రాడు. నీవు చేసిన మంచి కార్యాలే నీకు పనికివస్తాయి కనుక ఈ విద్యలన్నియూ కేవలం ప్రాకృతమైన విద్యలే. ఇవి జీవించటానికి మాత్రమే ఉపయోగపడుతాయి. ఇవన్నీ అవిద్యలేగాని విద్యలు కావు ఆత్మవిద్యలు కూడా కొంతవరకు నీవు అభ్యసించాలి. ఆత్మవిద్యలు మాత్రమే యీ పవిత్రమైన సద్భావనలు చేకూరుస్తాయి. లౌకిక విద్యలు తలతో చేసినటువంటివి. ఆత్మవిద్యలు హృదయముతో కూడినటువంటివి ప్రతి మానవునికి హృదయము, తల రెండూ ప్రధానమైనటువంటివి. తలతో వచ్చినవన్ని ప్రవృత్తులు. హృదయంతో పుట్టినవన్ని నివృత్తులు. ఈ ప్రవృత్తి నివృత్తులయొక్క

సమ్మిళితమైన భావమే మానవ జీవితము. కనుక కామ క్రోధ లోభ మద మాత్సర్యములన్నీ యీ ప్రవృత్తిమార్గంలో పుడుతున్నాయి ప్రేమ, సత్యం, త్యాగం, సహనం, సానుభూతులు హృదయము నుండి ఆవిర్భవిస్తున్న సద్గుణములను మనం సాధనంగా తీసుకున్నప్పుడే యీ ప్రవృత్తిలో మనం సార్ధకతను పొందవచ్చును కనుక ప్రవృత్తికూడా మనకు ఉండవలసినదే.

"ఇహమున సుఖియింప హేమ తారక విద్య, పరమున సుఖియింప బ్రహ్మవిద్య" యీ రెండు విషయాలలో మానవుడు ఉత్తీర్ణుడు కావాలి ఉత్తీర్ణుడు కావాలంటే మనం ఏం చేస్తున్నాం? అనేక శ్రమలచేత మనం చదవటం ప్రారంభిస్తున్నాం. ఇది కాదు.

"చదువులన్నియు చదివి చాల వివేకియై
మదిని తన్నెఱుగడు మందమతుడు
ఎంత చదువు చదివి ఏ రీతి నున్నను
హీను డవగుణంబు మానలేడు"

"తరచి చదువ చదువ తర్కవాదమె కాని
పూర్ణజ్ఞానమెపుడు పొందలేడు
చదువులన్నియు చదివి చావంగ నేటికి
చావులేని చదువు చదువవలయు"

ఈ చదువులన్నీ చచ్చే చదువులే చావటమంటే ఏమిటి? నేర్చినవన్నీ మరచిపోతున్నాం ఏవీ ప్రాణంతో వుండేటటువంటివి కావు కానీ చావని చదువేమిటి? అదియే "సోఽహం ... సోఽహం ... ఆ విద్యను నేర్చుకోవాలి ఈ విద్యయొక్క అంతరార్థమేమిటి? సో ... హం, సో ... హం - నేనే అది. తత్, త్వం, నేనే దైవము, నేనే దైవము-యీసహజమైనటువంటి విద్య స్వస్వరూపంగా నీవు వెలిబుచ్చుతుండాలి. ఒక్క దినమునకు 21,600 పర్యాయములు నేనే దైవము నేనే దైవము అని ఉచ్ఛ్వాస విశ్వాసములతో

## పావన శుభనామ పర్తిరామ!

సీ॥ నీ చూపులే విరబూచిన పూవులై
'సత్య' సుగంధంబు చల్లుచుండు!
నీ సూక్తులే మాయనిద్రను మాన్పించి
'ధర్మ' పథంబుపై ధ్యాస నిలుపు!
నీ లీలలే మారుమూలల కెగ్రాకి
'శాంతి' నిలయ కీర్తి చాటుచుండు!
నీ బోధలే సంఘనీతిని పురికొల్పి
'ప్రేమ' స్వరూపుల పెంచుచుండు!
ఆ.వె.: విశ్వహితము గోరు విశ్వంభరుడవైన
నీదు రూపమేదో నిర్ణయింప
సాధ్యమగునె కోటి జన్మలకైనను
'పావన శుభనామ' 'పర్తిరామ!'

– ఏకా రామచంద్రరావు

ప్రబోదిస్తుండాలి కాని ఈ విద్యలు నీవు అభ్యసించటానికి పూనుకోవటంలేదు. ఏ Bookkish knowledge (పుస్తకజ్ఞానం) నో తీసుకొని తద్వారా నీవు వాదోపవాదములలో ప్రవేశిస్తున్నావు. ఇది కాదు నీకు ప్రధానమైన విద్య Practical knowledge (అనుభవజ్ఞానం) కావాలి. నిత్య జీవితంలో ఆనందాన్ని అందించే విద్య కావాలి. భౌతిక విద్యలతోపాటు ఆత్మవిద్యను కూడా అభ్యసించాలి ఈ లౌకికవిద్యలన్నిటికినీ మనసే కారణం. ఆత్మ విద్యకు ప్రేమయే కారణం. ఈ ప్రేమతత్వాన్ని మనం పెంచుకోవాలి. ప్రేమ ఎక్కడ ఉంటుందో అక్కడ ద్వేషం ఉండదు. ద్వేషం లేని చోట ప్రశాంతత ఏర్పడుతుంది. ఆ ప్రశాంతతను మనం జగత్తుకంతా పంచిపెట్టాలి. ఈనాడు దేశం

ప్రశాంతంగా ఉండాలంటే మనం ప్రేమతత్త్వాన్ని పెంచుకోవాలి. ఏమిటి ఈ ప్రేమతత్త్వము? హలో... హలో ... ఇది కాదు ప్రేమతత్త్వము ఏకాత్మ భావాన్ని మనం పెంచుకోవాలి. అందరియందును ఉండినటువంటి ఆత్మతత్త్వము ఒక్కటేననే అభిప్రాయాన్ని కలిగిఉండాలి. ఆత్మను ప్రేమించుతే సర్వులనూ ప్రేమించినవాడవవుతావు. దీనిని ఉపనిషత్తులు చెప్పాయి "సర్వజీవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవికి నమస్కారం చేసినా కేశవునికి చేసినట్లే అవుతుంది. ప్రతి జీవియందు ఆత్మ స్వరూపుడుగా ఉంటున్నాడు భగవంతుడు. కనుక నీ వెవరికో నమస్కరిస్తున్నావని భావించకూడదు. ఆ దేహమనే దేవాలయంలో నివసిస్తున్న ఆత్మకు నేను నమస్కరిస్తున్నాననే అభిప్రాయం కలిగిఉండాలి. ఈ దేహమనే దేవాలయం కూడనూ స్థిరమైన దేవాలయం కాదు ఇది కదిలే దేవాలయం రాళ్ళతో, సున్నంతో కట్టిన స్థిరమైన దేవాలయమునకు మనం ప్రదక్షిణ చేయటానికి బదులు సజీవమైన దేహానికి మనం ఎంతో సేవ చేయవచ్చును. నిర్జీవమయిన రాళ్ళకు మ్రొక్కటానికి బదులు సజీవమైన జీవులను పోషించటానికి, సేవించటానికి కృషి చేయాలి

ఈనాడు విద్యార్థులలో జాతీయతాభావం క్షీణించిపోయింది ఇది మన దేశం, ఇది మన మతము, మన మానవత్వం అనే దివ్యత్వాన్ని మనం పెంచుకోవాలి మానవులందరూ ఒక మతంవారే మనమందరమూ యీ పవిత్రమయిన భారతదేశంలో పుట్టినవారమే అట్టి జాతీయతాభావం నేడు విద్యార్థులలో దినదినానికి క్షీణించిపోతున్నది ఇది మంచిది కాదు. ఏ దేశంలో పుట్టామో, ఏ దేశంలో జీవిస్తున్నామో – ఆ దేశానికి తగిన కృతజ్ఞతను అందించాలి కనుక ఇటువంటి విశాలమయిన భావాలు యీనాడు విద్యార్థులలో అభివృద్ధి కావాలి. ఉపనిషత్తులు మరొకటి చెప్పినది. "సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించినా భగవంతుని తిరస్కరించినవారమవుతాం భగవద్గీత కూడా ఇదే బోధించింది. జీవితమంటే ఒక గొప్ప ప్రవాహముతో సమానం. ఈ ప్రవాహం ఏ సాగరంలోనో చేరటానికి ప్రయత్నిస్తుంది. ఈ జీవితమనే ప్రవాహానికి హద్దులు లేకపోతే గ్రామమునే ముంచివేస్తుంది మానవత్వాన్ని కూడా నశింపజేస్తుంది. కనుకనే ఈ ప్రవాహమునకు ఇరువైపులా రెండు గట్లు ఉండాలి ఏమిటా గట్లు? "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" ఇది ఒకవైపు గట్టు. శ్రద్ధతో మన జీవితాన్ని గడపాలి ఇది ఒకవైపున హద్దు. ఇక రెండవది. 'సంశయాత్మా వినశ్యతి' ఇది రెండవ వైపున గట్టు ఏ విషయంలోను మనం సంశయించకూడదు నమ్మకం కలిగినటువంటివాడే నరుడు నమ్మకమే లేకపోతే ఒక్క క్షణమయినా యీ జగత్తులో ఉండలేం మార్కెట్‌కు వెళ్ళి తిరిగి వస్తామో లేదో అనే నమ్మకమే లేకపోతే మార్కెట్‌కే వెళ్ళలేం ఏ చిన్న పనిచేసినా నమ్మే చేస్తున్నావు. కాని భగవంతుని నమ్మటానికి మాత్రం వెనుకంజ వేస్తున్నావు ఇదే మనలోని బలహీనత భగవంతుడే లేకపోతే ఏమీలేదు యీ జగత్తులో విశ్వమంతా విష్ణుమయమే సర్వమూ భగవంతుని యొక్క స్వరూపమే. ఇలాంటి సర్వత్రా వుండినటువంటి భగవత్ తత్త్వాన్ని మనం నమ్మలేకపోతున్నాం అల్పమైన, తుచ్ఛమైన విషయాలను నమ్మి జీవిస్తున్నాం. నీవే దైవము నీకంటే ప్రత్యక్షమైన దైవము మరొకటిలేదు. సుగుణాలను పెంచుకుంటే నీవే దైవము ఆ సుగుణాలు నీలో లేకపోతే నీవే దయ్యము. దయ్యమూ నీవే, దైవమూ నీవే సత్కర్మలే దైవమునకు సాక్షి దుష్కర్మలే దయ్యానికి సాక్షి దయ్యం కావాలన్నా, దైవం కావాలన్నా అంతా నీ మీదనే ఆధారపడి ఉన్నది.

విద్యార్థులారా! దైవచింతన మాత్రం మారం చేయకండి. సర్వమునకూ దైవమే సాక్షి సర్వమునకూ దైవమే మూలం దైవాన్ని ప్రేమించండి. సర్వులనూ ప్రేమించండి.

( బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో ది 28-5-93న భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు చేసిన దివ్య ప్రసంగమునుండి )

# గీత-అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ ప్రయత్నాద్యత మానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।
అనేక జన్మ సంసిద్ధస్తతో యాతి పరాంగతిమ్ ॥

— అందించేవాడు సిద్ధంగా వుండినప్పటికినీ అందుకొనేవాని చేయికూడా పరిశుభ్రంగా వుండాలి లేకుంటే ప్రయోజనంలేదు ఐతే ఆ పరిశుభ్రత ఊరకే లభిస్తుందా? దానికి నిరంతర ప్రయత్నం కావాలి. అదే యిచ్చటి ప్రస్తుత ప్రస్తావన. నిరంతర ప్రయత్నశీలుడయిన యోగి సమస్త పాపములనుండి విడివడి, పరిశుద్ధుడై, అనేక జన్మలలోనూ ఈవిధంగానే శ్రమపడి సంపాదించి పెట్టుకొన్నటువంటి సుకృతఫలముగా దివ్యత్వాన్ని పొందుతున్నాడని భగవానుని హృదయము.

మనం ఎన్ని సాధనలు, ఎంత గొప్పగా సలిపినా పాపప్రక్షాళనం కానిదే ప్రయోజనంలేదు. అందుకే సమస్త పాపములనుండి విడివడి పరిశుద్ధుడు కావాలని దైవబోధ. నేడు చెప్పునది పరత్వము, చేయునది పాపత్వము. అందులకే సిద్ధిలేదు సాధకుడు మొదట దైవసిద్ధికై కాకుండా పాపరాహిత్యానికై సాధన చేయాలి పాపం లేనిచోట పరమాత్ముడు సహజంగా వుంటాడు. సాధకులు కనిపిస్తున్నారు, కానీ సత్యం కనిపించటంలేదు దైవభక్తులు కనిపిస్తున్నారు, కానీ ధర్మం కనిపించటంలేదు. ఇదేనా సాధన. వీరికి దైవప్రాప్తి ఉన్నదనుట వట్టిమాట. అందువలన పాపములనుండి పరిశుద్ధుడు కావాలి.

అసలు "కిల్బిషం" అనగా ఏమిటి? అనేది మొదట మనం గుర్తించాలి అప్పుడే దానిని మనం విడువగలము. "కిల్యతే శిథిలీ క్రియతే అనేన లోక ఇతి కిల్బిషం; కలకిలక్రీడాయాం శైథిత్యేచ" అనగా దీని చేత లోకము శిథిలముగా చేయబడును— అని అర్థము మరియు "కిలయతి క్షేపయతి నరకేవా కిల్బిషం" అనగా నరకమునందు పడద్రోయునది — అని మరొక అర్థము. లోకనాశనమును కలిగించునది, నరకమునందు పడద్రోయునది కిల్బషము. అనగా వ్యక్తి నాశనము, లోకనాశనము — ఈ రెంటి నాశనానికి ఏది కారణమో అదే కిల్బిషము. దుష్టచింతలు, దుష్టవాక్కులు, దుష్టకర్మలు ఇవి మూడింటికి కిల్బిషములని పేరు పరమాత్మని దిక్కరించి ప్రకృతికి అనుసరించటమే కిల్బిషము రక్తి కిల్బిషము; భక్తి తద్విరుద్ధము. కనుక మొదట ఈ పాపములనుండి విడివడుటకు నిరంతర ప్రయత్నం చేయాలి పాపమును క్షణం కూడా స్పర్శించరాదు. ధర్మమే దైవ మార్గము.

ఈ విధముగా కష్టపడి, దైవానుగ్రహమును అనేక జన్మలనుండి సంపాదించి ప్రోగుచేసిననే దివ్యత్వము ప్రాప్తిస్తుంది దీనికి సహనం కావాలి సహనశూన్యునికి ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశం లేదు. సహనమునకు ప్రేమ, శ్రద్ధ, శరణాగతి ఇవి కావాలి. ఇవి లేనివారికి సహనముండదు కనుక దైవమునందు నిశ్చల భక్తి గల్గి, సమస్త పాపకార్యముల నుండి దూరుడై, నిరంతర సాధనాతత్పరుడై వుండాలి సాధకుడు. తాను చేసే సాధన ఎప్పుడు ఫలిస్తుందా? అనే బుద్ధి వుండరాదు. సాధన చేయుటయందే ప్రేమ గల్గి వుండాలి గానీ, సాధనాఫలాన్ని గురించి యోచించరాదు. అప్పుడే నిజమైన ఫలం ప్రాప్తిస్తుంది. చదువుటయందే దృష్టి గలిగిన వానికి మంచి మార్కులు లభిస్తాయి. ప్రతి పుట చదువుతూ ఎన్ని మార్కులు వస్తాయి? అని యోచించేవానికి సరైన మార్కులు రావు ఇది గుర్తించాలి అట్లు గుర్తించి సాధన సలిపి తరింతుముగాక ! స్వస్తి!



# కౌమారగిరి

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 14-12-76

చిరంజీవులకు ఆశీస్సులు.

లోగడ ఉత్తరంలో దైవభక్తి, సోదర ప్రేమలను గురించి వ్రాశాను. ఈ లేఖలో సత్యం, అహింసల విశిష్ఠతను గురించి వ్రాస్తున్నాను

## సత్యం

"సత్యమేవ జయతే" సత్యమే జయించునని మన స్మృతులు ఎలుగెత్తి చాటుచున్నాయి సత్యమనగా నిజము. అబద్ధమాడకుండా వుండటం ఎన్ని కష్టములు వచ్చినా, బాధలు కలిగినా, అవాంతరములు ఏర్పడినా, చిట్టచివరకి ప్రాణానికే ముప్పు వాటిల్లినా సత్యమునే పలుకవలెను. సత్యమార్గమునే పయనించవలెను. సత్యమునే అనుసరించవలెను. అసత్యం చెప్పినయెడల లేక అబద్ధమాడినయెడల ఒకవేళ సంపదలు కలిసి రావటానికి మంచి అవకాశం ఉన్నా, అట్టి దుష్ట ప్రయత్నం మాత్రం చేయరాదు ఒకవేళ ఎవరైనా సరే పొరపాటున చేయకూడని పని చేస్తే, పెద్దలు దండించుతారనే భయంతో సహజంగా పిల్లలు అబద్ధమాడుతారు. ఆ అబద్ధాన్ని కప్పిపుచ్చుకోవడానికి మళ్ళీ మరొక అబద్ధం ఆడుతారు. తరువాత అబద్ధమాడటానికి ఏమాత్రం వెరువరు, సంకోచించరు. చివరకు అది అలవాటు అయిపోతుంది ఇది మాత్రం మంచి పద్ధతి కాదు. దీనివల్ల ఆ విద్యార్థి యొక్క విలువ పెరుగక పోగా తరిగిపోతుంది. నైతిక భ్రష్ఠుడవుతాడు చేసిన పని ఒకవేళ తప్పే అయినప్పటికీ, ధైర్యంగా ఒప్పుకోవడంలోనే వున్నది గొప్పతనం. మళ్ళీ అటువంటి పొరపాటు జరుగకుండా జాగ్రత్తపడాలి పెద్దలు కూడా సహనంతో అనుగ్రహించి, అనురాగంతో మృదుమధురమైన మాటలతో, చేసిన పొరపాటును విడమరచి చెప్పి దానివలన వచ్చే చెడును తెలిపి, భవిష్యత్తులో అట్టి పొరపాటు జరుగకుండా చూడాలి. సత్యానికి నిదర్శనం, ఆదర్శం "సత్యహరిశ్చంద్రుడు" కష్టములొచ్చినప్పుడు ఆ మహనీయుని స్మరించుకొనవలెను ఆడిన మాటను నిలబెట్టుకోవడానికోసం, రాజ్యాన్ని, తన సర్వస్వాన్ని త్యాగం చేసిన "త్యాగశీలి" చిట్టచివరకు తన భార్యాపిల్లలను పోగొట్టుకున్న 'సత్యవ్రతుడు'. అటువంటి భీకర భయంకరమైన భరించరాని యిక్కట్లు దాపురించినప్పటికినీ, ఏమాత్రం చలించకుండా, సత్యపథమును విడనాడకుండా చక్కటి ఆదర్శమును నెలకొలిపిన "మహానుభావుడు". సత్యమూర్తులు తాము చేసిన వాగ్దానాన్ని సదా స్మరించుకుంటుంటారు. ఆపదలు ఒకదాని తరువాత ఒకటి వచ్చి మీద పడుతున్నా, ధైర్యాన్ని కోల్పోక, సత్యపథమును విడిచిపెట్టరు "సత్యమునకు ప్రాణం పోదు. అసత్యమునకు జీవం రాదు" ఈ వాస్తవాన్ని గ్రహించుతే మానవునికి ఎట్టి యిబ్బందీ వుండదు. కనుక ప్రతివారూ ఎల్లప్పుడూ ఓర్పుతో, ఓర్మితో సత్యమునే పలుకవలెను.

## అహింస

" అహింసా పరమో ధర్మః " అహింస పరమోత్కృష్టమైన ధర్మము అని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి అహింసా సిద్ధాంతమనగానే చాలా మంది, ఇది చేతకానివారు, అనామకులు, బలహీనులు చెప్పే సిద్ధాంతమని అపోహ పడుతున్నారు ధైర్యము, శక్తి, బలము కలిగివుండి కూడా, అన్యోన్య ప్రేమను ప్రదర్శిస్తూ, కరుణ, దయ, ప్రేమలను వర్షిస్తూ, శాంతియుత, ప్రశాంత వాతావరణమును కలుగజేయునదే అహింసా సిద్ధాంతం. హింసకు దిగకుండా, ఆత్మ విగ్రహమును ప్రదర్శించేదే అహింసావాదం సహనమే అహింస అహింస ధర్మం, హింస అధర్మం (చేయకూడని పని) హింస చేయకూడని పని అని భావించి, విష జంతువులైన తేలు, పాము, పులి మొదలగు క్రూర జంతువులను చంపకుండా వదలటం విజ్ఞత కాదు అదేవిధముగా చెడు ప్రవర్తన కలవారిని, దుష్టులను శిక్షించడం ఏమాత్రం అధర్మం కాదు అట్టి వారిని వదలి పెడితే వారి చెడుప్రవర్తన వలన సమాజనికి తిరిగి నష్టం వాటిల్లుతుంది సమాజహితం కోరి దుష్టులను శిక్షించడం ఉత్తమ ధర్మం అందుకోసమనే "దుష్టశిక్షణ, శిష్టరక్షణ" కోసం అప్పుడప్పుడూ అవతరిస్తానని భగవంతుడు గీతలో చెప్పాడు. హింసా ప్రవృత్తి పెచ్చుపెరిగి, అరాచకం చెలరేగి, అశాంతి విలయతాండవం చేస్తున్న రోజులలో బుద్ధుడు వచ్చి అహింసావాదాన్ని ప్రజలలో ప్రచారంచేసి, శాంతిని నెలకొల్పాడు అదే అహింసా సిద్ధాంతాన్ని మహాత్మా గాంధీజీ వెలుగులోనికి తీసుకొనివచ్చాడు. కనుక సర్వ శక్తివంతమైన, నైతిక శక్తిని చేకూర్చే టటువంటి అహింసా సిద్ధాంతాన్ని అందరూ అనుసరించాలి, పాటించాలి, ప్రపంచ శాంతికి తోడ్పడాలి. ఇదే ఈనాటి మన కర్తవ్యం.

ఇక వుంటా...

ఇట్లు
మీ 'నాన్న'

## మనం అమృత పుత్రులం

ఈ భారతనందనంలో పరిమళించే
ప్రసూనాలం మనం
ఈ దేశం కోనలలో వెలిగే దీపాలం మనం
ఈ పవిత్ర ధాత్రిపై లేచిన
చందన వృక్షాలం మనం
ఈ సుందర కాశ్యపిపై ప్రభవించిన
అమృతపుత్రులం మనం
తిమిరాలతో పోరాడడం
దీపాలు వెలిగించడం
వెలుగులు పంచడం
వెలుగులోకి పయనించడం
చిరకాలంగా మన జీవనధర్మం
జీవకారుణ్య భావనం
భావ సమైక్య జీవనం
అనాదినుంచీ మనకు అలంకారం
మనిషిలో దేవుణ్ని చూసినవాళ్ళం
మనుగడనే స్వర్గం చేసినవాళ్ళం
విశ్వశాంతి వీణను మీటినవాళ్ళం
విశ్వశాంతి గీతాన్ని పాడినవాళ్ళం
వర్తమానం ఎంత క్లిష్టమైనా
శ్రమిద్దాం ముందుకు నడుద్దాం
ఆశయ సాఫల్యం కోసం
అందరం నడుం బిగిద్దాం
మనం అమృతపుత్రులం
మనం అమృత పుత్రులం.

— తిరునగరి

# నిజాం రాష్ట్ర ఆంధ్రుల వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డి

—కంచి వాసుదేవరావు

నిజాం పరిపాలనలో ఆంధ్రులు అన్నివిధాలా అణగత్రొక్కబడుతున్న రోజులలో - నిర్వీర్యమైన ఆ రాష్ట్రంలోని తెలుగుజాతిని తట్టిలేపిన వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డిగారు. ఆయనలో ఒక ముట్నూరి కృష్ణారావును - ఒక కాశీనాథుని నాగేశ్వరరావును- ఒక కందుకూరి వీరేశలింగంను - ఒక కామరాజు లక్ష్మణ రావును - ఒక గురజాడ అప్పారావును చూడవచ్చు. ఆయన పత్రికా సంపాదకుడు, సాహిత్య పోషకుడు - సంస్కర్త - చరిత్ర పోషకుడు - కథా రచయిత

ముట్నూరి కృష్ణారావుగారు పేరుతో కృష్ణాపత్రిక ముడిపడి వున్నట్లే, ప్రతాపరెడ్డిగారి పేరుతో గోల్కొండ పత్రిక ముడిపడి వుంది. బ్రిటిష్ పాలనలో వున్న తెలుగు ప్రజల రాజకీయ సామాజిక సాంస్కృతిక చైతన్యానికి - కృష్ణాపత్రిక ఎనలేని చైతన్యం కలిగించినట్లే తెలుగు ప్రజలను జాతీయభావ వుత్తేజితులను చేసినట్లే- ప్రతాపరెడ్డిగారి గోల్కొండ పత్రిక నిజాం రాష్ట్ర ఆంధ్రులను వివిధ రంగాలలో చైతన్యవంతులను చేసింది.

1902 లో మచిలీపట్నంలో కృష్ణాపత్రిక స్థాపించినప్పుడు అప్పటి ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో చెప్పుకోదగ్గ తెలుగు పత్రికలు లేవు. అదేవిధంగా 1926 మేలో సురవరం ప్రతాపరెడ్డిగారు గోల్కొండ ద్వై వార పత్రికను స్థాపించినప్పుడు రెండు పత్రికలు మాత్రం మిణుకు మిణుకుమంటూ వుండేవి.

ప్రతాపరెడ్డిగారు ప్రారంభ సంచికలో (10-5-1926) స్వవిషయం అన్నశీర్షిక కింద ఈవిధంగా రాసుకున్నారు.

“ ప్రపంచమందలి పత్రికా ప్రచారముకల దేశములను బోల్చి చూచిన హిందుస్థానం చాలా హీనస్థితియందున్నది. ప్రస్తుతం నిజాం రాష్ట్రమునందు 65 లక్షలకన్న నెక్కుడాంధ్రులుండగా రెండు వారపత్రికలుండుట గొప్పలోటు ఒక చిన్నతిరువాన్కూర్ సంస్థానమందు నూర్లకొద్ది పత్రికలు వుండగా హైదరాబాద్‌లోని యాంధ్రులకై మూడవ పత్రిక యొకటి ప్రచారం చేసినందువలన మేము చింతింపము.

ఈ పత్రిక రెడ్లకొఱకేర్పడినదని కొందరు శంకించియున్నారు. రెడ్లయొక్క అభివృద్ధిని గోరుచుండునదైన నితరశాఖలు (కులాల) వారికి బ్రతికూలముగా నెప్పటికి నుండదని యందరికి విశదపరచుచున్నాము

ముఖ్యముగా నాంధ్రులలో నగ్రజన్ములను వారిని మొదలుకొని యంత్యజన్ములను వారివరకును మేము సేవ చేయ యత్నింపగలం

ఇక్కడ మనం గ్రహించవలసిన విషయం ఒకటి వుంది ప్రస్తుతం అభ్యుదయ భావాలు గలవారని చెప్పుకుంటున్న వారిలో చాలామంది కులమతాభిమానాలు అభివృద్ధినిరోధకాలని భావిస్తూవుంటారు - సమాజంలో కుల, మత భావనలు ఎంతగా పాతుకుపోయాయో గుర్తించారు. ఈ గుర్తింపులేకుండా చేసే విన్యాసాలన్నీ ముట్నూరి కృష్ణారావుగారు ఒకచోట చెప్పినట్లు వృథా ప్రయాసలే స్వీయనుల మతాభిమానాలు యితర కులాలు మతాలవారిపై ద్వేషభావాన్ని - వైషమ్యాలను పెంచే - దురభిమాన దురహంకార స్థాయిని చేరుకోనంతవరకు యివి హర్షించతగ్గవే. ఈ దృక్పథంలో ప్రతాపరెడ్డిగారు స్వీయ కులాభిమానాన్ని చూపకోలేదు అది యితర

కులాలకు హాని కలిగించే అవకాశాలు కల్పించలేదు. అదే వారి వ్యక్తిత్వంలోని విశేషం.

## కృష్ణా ఆంధ్ర పత్రికల మేలుకలయిక అయిన గోల్కొండ

ప్రతాపరెడ్డిగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయన విషయ పరిజ్ఞానం అపారం గోల్కొండ పత్రిక సంపాదకీయాలలో ఆయన పదమడి రాజకీయ ఆర్థిక సామాజిక సమకాలీన సమస్య ఏదీ వుండేది కాదు. సందర్భవశంగా ప్రాచీన కవులు, చక్రవర్తుల గురించి రాయవలసివచ్చినా, అవి ఆయన విషయపరిజ్ఞానానికి అద్దం పట్టేవి. ఆయనది విశిష్టమైన శైలి - ఎవరికి అలవడని శైలి - గోల్కొండలో సంపాదకీయాల శైలి బట్టి ( ఆయన వూళ్ళో లేనప్పుడు మరొకరు సంపాదకీయాలు రాసేవారు) ఆయన వూళ్ళో వున్నదీ లేనిదీ ఆయన మిత్రులు గ్రహించేవారుట ఈ సంపాదకీయాలప్రాచుర్యంతో కాని ప్రాశస్త్యంతో కాని, పోల్చదగినవి ముట్నూరివారి కృష్ణాపత్రిక సంపాదకీయాలే కృష్ణాపత్రిక మాదిరి గోల్కొండ పత్రిక ప్రతి గ్రామానికి వెళ్ళేది ఆంధ్రపత్రికను "న్యూస్ పత్రిక" గా, కృష్ణాపత్రికను "వ్యూస్ పత్రిక" గా విమర్శకులు పేర్కొంటారు గోల్కొండ పత్రికలో "న్యూస్ వ్యూస్" మేలుకలయికగా వుండేది. మరొక విధంగా చెప్పాలంటే కృష్ణాపత్రిక ఆంధ్రపత్రికల సమిష్టిరూపం గోల్కొండ పత్రిక.

కృష్ణారావుగారి మాదిరి ప్రతాపరెడ్డిగారు నూటికి నూరుపాళ్ళు జాతీయవాది. బ్రిటీష్ పాలనను విమర్శించడానికి కృష్ణారావుగారు ఎంతమాత్రం వెనకాడనట్లే ప్రతాపరెడ్డి నిజాం నిరంకుశ పాలనను విమర్శించడానికి ఏనాడు వెనుకాడేవారు కారు.

1947 లో గోల్కొండ పత్రిక దిన పత్రికయింది నిజాం పాలననుంచి విముక్తికోసం నిజాం సంస్థాన ప్రజలు తీవ్రమైన ఆందోళన జరుపుతున్న రోజులవి. ఈ ప్రజా ఉద్యమం చూచి భీతిల్లిన నిజాం పాలకులు

## విదురనీతి

"నిత్యో ధర్మః సుఖదుఃఖేత్వ నిత్యే
జీవో నిత్యో హేతురస్య త్వ నిత్యః
త్యక్త్వానిత్యం ప్రతితిష్ఠస్వ నిత్యే
సంతుష్యత్వం తోష పరోహి లాభః"

ధర్మము నిత్యమైనది. సుఖదుఃఖములు మాత్రము అనిత్యములైనవి జీవుడు నిత్యముగ నుండువాడు. కాని అవిద్య యనునది అనిత్యము అనిత్యమైనదానిని వదలి, సంతుష్టుడవై నీవు నిత్యమైనదానియందు స్థితుడవగుము సంతోషాతిశయమే లాభదాయకము.

గోల్కొండ పత్రికా సంపాదకీయాలపై ప్రీసెన్సార్ షిప్‌ను విధించారు ఇది పత్రిక ఆత్మగౌరవానికి భంగకరమని ప్రతాపరెడ్డిగారు భావించి సంపాదకీయాలు రాయడం మానుకున్నారు. ఐతేనేం ఆ స్థలంలో ప్రపంచ ప్రజాస్వామికవాదులు వివిధ భాషలలో చేసిన స్ఫూర్తిదాయకమైన ప్రసంగాలను సందర్భోచితంగా ప్రచురించి వాటిని తన సంపాదకీయాలకన్న పదునైన ఆయుధాలుగా ప్రయోగించి నిజాం పాలకులను చికాకు పరచేవారు

## హిందువుల పండుగ అంతరార్థం

ఒకసారి నిజాం నవాబు తన దివాన్ పింగల వెంకట్రామరెడ్డిగారిని పిలిచి ఒక హిందూ పండుగ అంతరార్థం ఏమిటని అడిగినారుట. దానికి రెడ్డిగారు సమాధానం చెప్పలేక తన మిత్రుడయిన సురవరం ప్రతాపరెడ్డిగారిని అడిగి తెలుసుకున్నారుట. బహుశ ఇది దృష్టిలో వుంచుకొనే హిందువుల పండుగలు అనే ఉద్గ్రంధాన్ని రచించారు. అందులో ఒక్కొక్క హిందువుల పండుగల అంతరార్థాన్ని విపులంగా వివరించారు.

ప్రతాపరెడ్డిగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు మల్లంపల్లి సోమశేఖరశర్మల శ్రేణిలో నిలువదగ్గ చారిత్రిక పరిశోధకులు. ఆయన పరిశోధనా కృషి ఫలితమే ఆంధ్రుల సాంఘిక చరిత్ర. శాతవాహనుల ఇక్ష్వాకుల కాలం నాటినుంచి ఆంధ్రుల సాంఘిక వికాసాన్ని ఆయన అందులో వివరించారు. అదేవిధంగా రామాయణంలోని విశేషాలను పరిశోధనా దృష్టితో వివరించారు హైందవ ధర్మవీరులలో కూడా ఇదే దృష్టి కానవస్తుంది.

## ఉత్తమ కథా రచయిత

ప్రతాపరెడ్డిగారు ఉత్తమ కథారచయిత. ఈ విషయంలో ఆయన గురజాడ అప్పారావుగారిని స్ఫురింపచేస్తారు అప్పారావుగారు మాదిరి ప్రతాపరెడ్డిగారు కూడా రాసిన కథలు బహు కొద్ది మాత్రమే. ఐనా ప్రతి ఒక్కటీ ఆణిముత్యమే ముఖ్యంగా కన్యాకుమారి ముగ్ధ ప్రణయకథ

ప్రతాపరెడ్డిగారి గురించి దేవులపల్లి రామానుజరావు గారు ఒకసారి రాస్తూ "ప్రతాపరెడ్డిగారు బహు భాషా విశారదులు - ఉత్తమ శ్రేణికి చెందిన పండితులు మంచి పరిశోధకులు తెలుగులో అనేక సృజనాత్మక రచనలు చేసిన భావుకులు వీరు కవితలు అల్లినారు. కథలు చెప్పినారు, నాటకాలు వ్రాసినారు. ప్రామాణికమైన గ్రంథాలను వ్రాసినారు" అని కీర్తించారు

హైదరాబాద్ సంస్థానంలో అనేక సంస్థలకు ఉద్యమాలకు ప్రతాపరెడ్డి గారు వెన్నెముకగా నిలిచారు ఈ విషయంలో ఆయన దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారిని తలపింపచేసారు. సంస్కర్తగా వీరేశలింగం గారిని తలపింపచేసారు

## నిజమైన ఆంధ్రుడు

ఆంధ్ర రాష్ట్రాన్ని విశాలాంధ్రను మనసారా కాంక్షించారు ఆయన నిజాం రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతాన్ని తెలంగాణా అని సాధారణంగా పేర్కొనేవారు కాదు-తెలుగు మాట్లాడేవారిని ఆంధ్రులుగానే భావించేవారు. ఆంధ్రులంటే కోస్తా, రాయలసీమ జిల్లాలకు చెందిన తెలుగువారు మాత్రమేనన్న ఇప్పటి సంకుచిత దృక్పథం వారికి వుండేది కాదు.

ఆయన తన కులాన్ని, తన మతాన్ని, తన భాషను తన జాతిని ప్రేమించారు ఇవన్నీ ఆయన విశాల విశ్వ మానవ దృక్పథంలోని అంతర్భాగాలే.

ప్రతాపరెడ్డిగారు న్యాయశాస్త్ర పట్టభద్రులు ఆ వృత్తిలో వుంటే న్యాయమూర్తులు అయ్యేవారు. ఉద్యోగమే కోరుకుంటే ఆయనకు గల పలుకుబడిబట్టి పెద్ద ఉద్యోగమే దొరికేది అనువంశికవృత్తి వ్యవసాయాన్ని చేపట్టినా అందులో మరింత రాణించి వుండేవారు. ధన సంపాదనే పరమావధిగా పెట్టుకుంటే అనేక మార్గాలు వుండేవి కాని యివి ఏవీ వారిని ప్రలోభపెట్టలేదు. నిశిత కంటక మార్గమైన పత్రికా సంపాదకత్వాన్ని పత్రికా నిర్వహణాభారాన్ని నెత్తిన వేసుకున్నారు నిర్వీర్యమైన జాతిని మేల్కొల్పి కర్తవ్యోన్ముఖులను చేయగల సాధనం - పత్రిక మాత్రమేనని ఆయన విశ్వసించారు గోల్కొండను స్థాపించి జీవితంలో నిత్యసాధనగా, నిరంతర తపస్సుగా దాన్ని నిర్వహించారు నిజాం రాష్ట్ర ఆంధ్రుల వైతాళికులయ్యారు.

# పూర్ణమదః పూర్ణమిదం

-డా॥ రాపర్ల జనార్ధనరావు

" అది పూర్ణము (పూర్ణమదః). ఇది పూర్ణము " (పూర్ణమిదం) అని ఈ వేద వాక్యమునకు అర్థము

" ఓం పూర్ణమదః; పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మేవావ శిష్యతే. "

ఈ మంత్రము మహా ప్రసిద్ధమైన మంత్రము. మానవునికి (జీవాత్మకు), దైవానికి (పరమాత్మకూ) గల సంబంధం ఇచట నిర్వచింపబడింది. మానవునిలో నిగూఢమైన అనంత శక్తిని, దైవరూపాన్ని వివరించిన మంత్రం ఇది దైవముయొక్క సంపూర్ణత్వము, ఈ ప్రపంచముయొక్క భౌతిక సృష్టి లేదా మానవత్వము లోని సంపూర్ణతను తెలియజెప్పే మహత్తర మంత్రం. దీనిలోని భావం ఎంతో తీక్షణత, వైశాల్యం, పరిపూర్ణత కలిగి, మన దస్సిన హృదయాలకు ఒక వెలుగు, శాంతిని అందించే దివిటీ. సంపూర్ణత అనేది ఈ మంత్రానికి మూలవిరాట్.

" అచట ఉన్నది పూర్ణము.
ఇచట ఉన్నదీ పూర్ణమే
ఒక పూర్ణము నుండి.
ఇంకొక పూర్ణము ఉద్భవించింది
పూర్ణము నుండి, పూర్ణము వెలువడినను
మిగిలినది కూడ పూర్ణమే "

ఈ పూర్ణమును గూర్చిన భావనను అర్థం చేసికొనటం కొంత కష్టమే. మొదటగా ఇది లెఖ్ఖలు, కూడికలు, తీసివేతలు గూర్చిన విషయం కాదనేది గ్రహించాలి ఇది మానవునికీ, దైవానికీ గల సంబంధాన్ని తెలియ జెప్పే మంత్రమని గ్రహించాలి " యథా అండే, తథా బ్రహ్మాండే " ఈ అండము ( మానవుడు ) ఎలా ఉన్నాడో, ఆ బ్రహ్మాండము కూడా అలాగే ఉన్నది అని తాత్పర్యము " అహం బ్రహ్మాస్మి " " నేను బ్రహ్మము అయిఉన్నాను" అనెడి అద్వైత సిద్ధాంతము ఇందు గోచరించుచున్నది. "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అనెడి సూత్రము ద్వారా జీవాత్మ, పరమాత్మ లకు గల ఏకత్వము తెలియవచ్చుచున్నది.

ఒక పూర్ణస్వరూపమైన దైవము నుండి, పూర్ణ రూపుడైన మానవుడు వెలువడినాడు. ఈ వాక్యము వలన మానవునిలో నిగూఢమైయున్న అనంతత్వము, దైవత్వము, సంపూర్ణతా మనకు తెలియవచ్చుచున్నవి. అయితే మానవుడు ఎన్నో లోపములు కలిగినవాడు, ఎన్నెన్నో దుర్గుణములు కలిగిన మానవుడు, పూర్ణ స్వరూపుడు ఎలా అవుతాడు అనేది ఒక ప్రశ్న.

నిజమే, మానవుడు అసంపూర్ణుడుగ కన్పించటం నిజమే కాని మానవుని జీవనగమనం, ధ్యేయం అంతా సంపూర్ణత కొరకే. తనలో గల లోపాలను సరిదిద్దుకుంటూ, తన జీవితం అంతా ఒక సంపూర్ణత కొరకై మానవుడు పయనిస్తున్నాడు బాహ్యముగ కన్పించెడి అతని అసంపూర్ణతలో, సంపూర్ణత దాగికొని యున్నది మహాత్ములు, జీవన్ముక్తులు, ఈ సంపూర్ణతను పొందినవారని తెల్పవచ్చును

మానవుడు తనయందు ఇమిడియున్న " సంపూర్ణ తను" తెలిసికొనుటయే అతని నిరంతర ధ్యేయము. ఈ ఆత్మదర్శనమే ప్రధాన లక్ష్యముగ సాధకునికి ఉండవలెనని మహర్షులు ఉద్భోదించియున్నారు.

ఒకవిధముగ చూచిన ఆధునిక మానవుడు, తప్పు త్రోవను నడచుచున్నను, శాస్త్రపరిశోధనలయందు, అంతరిక్షయానముల యందును, తన అనంతశక్తిని చూపుచున్నాడు. "అణోరణీయాం మహతో మహీయాం" అణువైయున్నను అణువులోని మహత్తర విశేషాలను వెలికితీసి చూపించుచున్నాడు. హస్త సాముద్రికము చదివినవారందరకును, మానవుని అరచేతిలో నవగ్రహములు ఇమిడియుండి, వానినిగూర్చి చదివి ఆ వ్యక్తియొక్క గుణగణములు నిర్ణయించుట మనము చూచుచున్నారము. మన ఉచ్ఛ్వాస నిశ్వాసములలో నిక్షిప్తమైయున్న "సోహం" భావన, అద్వైత సంపూర్ణతను సూచించుచున్నది.

సంపూర్ణతను అనుభవించిన జీవన్ముక్తులు, వారి జీవితగాథలను గూర్చి మనము చదువుతూ ఉంటాము. "I am He" అని ఏసుక్రీస్తు "ఆయనే, నేను" అనెడి అద్వితీయ భావనను ఒకచోట ప్రకటించియున్నారు. రమణమహర్షి, అరవిందులు, రామకృష్ణ పరమహంస మొదలైనవారి జీవితములందు ఈ అద్వైత భావన మనము చూడగలము.

"పూర్ణమదః పూర్ణమిదః" అను మహామంత్రము మనకు నిజస్వరూపము చూపెడి తేజోకిరణముగ భావింపవచ్చును.

పరమహంస కథలు :

# ఇద్దరు మిత్రులు

ఆత్మవికాసము మనఃస్థితిపైనను భావములపైనను ఆధారపడియుండును. వికాసము హృదయము వలన గలుగవలయును గాని ఏ బాహ్య కర్మలవలనను గలుగదు. ఒక పర్యాయం ఇద్దరు మిత్రులు భాగవత కాలక్షేపము జరుగు తావునకు సమీపమునుండి పోవుచుండిరి. వారిలో ఒకడు "అదిగో! అచటికిపోయి కొంచెముసేపు పురాణము విందుము" అనెను. రెండవవాడు "ఎందుకోయి! భాగవతమును వినిన ఏమిలాభం? భోగమువాండ్ర యింటికి పోయి హాయిగా కాలక్షేపము చేయుదుము" అనెను మొదటివాడు అందులకు అంగీకరించక భాగవతా కాలక్షేపము జరుగుచోటికి వెడలెను రెండవవాడు భోగముదాని ఇంటికి పోయెను గాని అక్కడ తానాసించిన ఆనందమును పొందలేక తనలో తాను "అయ్యో! నేను ఇక్కడికేలవచ్చినాను? శ్రీహరి లీలలను వినుచు నా స్నేహితుడు ఎంత హాయిగా అక్కడ కాలక్షేపము చేయుచుండునోగదా! అని తలంచుచూ, ఆ అపవిత్రస్థలమున నుండియే హరిని గూర్చి భక్తితో ధ్యానించెను. మొదటివాడు భాగవత శ్రవణము చేయుచూ గూడా అందు ఆనందమును పొందలేక ఉన్న తాను నిందించుకుంటూ "ఆహా! ఎంత బుద్ధిహీనుడను! మిత్రునితోగూడ భోగముదాని ఇంటికిపోయి సుఖమనుభవించనైతినే! అతడెంత హాయిగా కాలక్షేపము చేయుచుండునోకదా!" అని చింతించుతూ బాధపడసాగెను. "చిత్తము శివునిమీద, భక్తి చెప్పులమీద" అన్నట్లు వీని మనసంతయూ భోగముదాని ఇంటిమీదనే ఉందెను. ఇట్లు వీని మనస్సు అపవిత్ర సంకల్పముతో మలినమై ఉండటం వలన, వాస్తవంగా భోగముదాని ఇంటికి పోకపోయినప్పటికీ పాపమునే పొందినాడు. ఇక భోగముదానింటికి పోయినవాడు, యదార్థముగా అపవిత్ర స్థలమున నున్నను, వానిమనస్సంతయూ భాగవత కాలక్షేపం మీదనే లగ్నమై ఉండటం వలన భాగవత శ్రవణం చేసిన పుణ్యమును అతను పొందినాడు. ఏకాగ్రత లేకుండా చేసే బాహ్య కర్మల వలన మోక్షం లభించదు. చిత్తశుద్ధి లేకుండా శివపూజ చేసినా ప్రయోజనం ఉండదు

రసవద్ఘట్టాలు–4

# ఓటమి నెరుగని ధీరులు

-జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ప్రొఫెసర్ యునస్ బంగ్లాదేశ్‌లోని చిట్టగాంగ్ విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర విభాగంలో ఆచార్యులు. ప్రజల బీదరికాన్ని గురించి, దేశంలో తాండవిస్తున్న దారిద్ర్యాన్ని గురించి పాఠాలు చెబుతూ తమ ఆవేదనను వెల్లడిస్తుండేవారు. దేశమంతటా పర్యటించారు. బీదరికాన్ని నిర్మూలించగల శక్తి తమకు లేనందుకు బాధపడేవారు.

ఎందరో బీదలు సహాయం ఆశిస్తూ వారి వద్దకు వచ్చేవారు ఎందరికి డబ్బులివ్వగలరు ? ఎందరిని ఆదుకోగలరు ?

బీదలంటే కరిగిపోయే, ప్రొఫెసర్ యునస్ బీదల కోసం ఒక బ్యాంక్ స్థాపించాలని నిశ్చయించారు. ఆ సంకల్పం అంకురించినపుడు వారికితోడుగ, మరొకరు లేరు బ్యాంక్ ప్రారంభించారు. అదో గ్రామీణ బ్యాంక్.

యునస్‌గారి బంగ్లాదేశ్ గ్రామీణ బ్యాంక్ క్రమంగా పెరిగింది. పంద్రెండు లక్షల బీదలకు ఋణ సౌకర్యం కల్పించింది. బ్యాంకు నుండి ఋణం అందుకొన్న వారిలో 90 శాతం మహిళలు. పూట గడవటం ఎలా ? అని తపిస్తున్న బీదలు కూటితోపాటు, గూటిని కూడా సాధించుకున్నారు

ఈ బ్యాంక్ పెట్టాలన్న ఆలోచన ఎలా కలిగిందో, మనలను ఆశ్చర్యం కల్గిస్తుంది విశ్వవిద్యాలయం పక్కన ఒక చిన్న గ్రామం. ఆ గ్రామంలోని వారంతా బీదలు చిన్న చేతివృత్తులే వారి జీవనాధారం. వెళుతూ దారిలో సుఫియాఖాతున్ అన్న మహిళ వెదురు బద్దలతో చిన్న స్టూల్ తయారుచేస్తుండటం చూచారు. ఆమె శ్రమకు ప్రతిఫలంగా ఏమి లభిస్తుందో కనుగొందామని ప్రొ. యునస్ ఆమెను ఈ స్టూల్ తయారుచేసినందుకు నీకు రోజు కూలి ఎంత? అని అడిగారు. " యాభై పైసలు " అని ఆమె సమాధానం చెప్పినపుడు ప్రొఫెసర్‌గారి మనసు కలుక్కుమన్నది.

ప్రొఫెసర్ ఆమెకు కొంత పైకం ఇచ్చారు. ఆమె సంపాదన పెరిగింది. కొన్ని నెలల్లోనే ఆమె ఆదాయం యాభై రెట్లు పెరిగింది.

ఆమెను ఒక బ్యాంక్‌కు తీసుకెళ్ళారు. ఆమెకు ఎలాంటి ఆస్తిపాస్తులు లేవు. బ్యాంక్‌వారు ఋణం ఇవ్వటానికి వీలు లేదన్నారు. ప్రొఫెసర్ యునస్ జామీన్ కావటంతో ఆమెకు అప్పు ఇచ్చారు.

నిర్గతికులైన వారిని ఏ బ్యాంకు సహకరించలేదని భావించిన ప్రొఫెసర్ తామే ఒక బ్యాంకును ప్రారంభించారు ఆ బ్యాంక్ బంగ్లాదేశ్ లోని బీదలకు వరప్రసాదంగా వ్యాపించింది. ఒక వ్యక్తి పెద్ద మనసు చేస్తే లక్షలాది కుటుంబాలను ఆదుకోగలరు అన్నమాటకు ఆచరణాత్మకమైన మార్గాన్ని చూపగలరనుట ప్రత్యక్ష సాక్షం ప్రొఫెసర్ యునస్‌గారు. మనసుంటే మార్గముంటుంది.

-O-

# జమదగ్ని మహర్షి

-పురాణపండ 'శ్రీచిత్ర'

పూర్వకాలమున ఋచీకుడను మహర్షి ఉండెడివాడు. అతడు గాధిరాజు కడకేగి ఆయన కూతురగు సత్యవతిని తనకిచ్చి వివాహం చేయమనికోరాడు. అంత ఆ రాజు తెల్లని శరీరము నల్లని కర్ణములు గల వేయి గుఱ్ఱములను తెచ్చి యిచ్చినచో వివాహం చేసెదనని పలికాడు. ఋచీకుడు వరుణదేవుని ప్రార్థించి గాధిరాజు కోరిన అశ్వములను తెచ్చియిచ్చాడు. అన్నమాట ప్రకారం సత్యవతిని ఋచీకునకిచ్చి అతి వైభవంగా వివాహం జరిపించాడు.

ఆ మహర్షి భార్యను వెంటబెట్టుకొని తన ఆశ్రమమునకు వెళ్ళిపోయాడు సత్యవతి భర్తకు సేవచేయుచూ కాలం గడుపుతున్నది భార్య చేయు సేవలకు సంతసించి ఒక కోరిక కోరుకోమన్నాడు. అంత సత్యవతి తన తల్లికొక పుత్రుని, తనకొక పుత్రుని ప్రసాదించమని కోరింది ఋచీకుడు సరేయని తన మంత్ర ప్రభావంచే రెండు చరువులను (దేవతలు అన్నం వండెడి కుండలు) సృష్టించి మొదటి చరువును సత్యవతి తల్లికి, రెండవ చరువును సత్యవతికి యని చెప్పి స్నానార్థమై తాను నదికి పోయెను

సరీగా అదే సమయానికి అల్లుని, కూతురిని చూడాలనే ఉద్దేశ్యంతో గాధిరాజు తన భార్యతో ఆశ్రమమునకు వచ్చిన తల్లిదండ్రులనుచూచి సత్యవతి సంతోషించింది ఆ చరువుల విషయం చెప్పి తల్లి అంగీకారం తీసికొని తానుపయోగించవలసిన చరువును తల్లికి, తల్లికిచ్చిన చరువును తాను పొరపాటును ఉపయోగించినది. అంతా విధి ప్రేరణ. సత్యవతి తల్లి విశ్వామిత్రుని సత్యవతి జమదగ్నిని కన్నారు. జమదగ్ని పెరిగిపెద్దవాడవుతున్నాడు యుక్తవయస్సు రాగానే రేణువు కూతురగు రేణుకను యిచ్చి వివాహము జరిపించారు. జమదగ్ని ఒక హోమ ధేనువును సంపాదించి, దాని శక్తిసామర్థ్యములతో సుఖంగా జీవిస్తున్నాడు ఒకనాడు జమదగ్ని రేణుకను వెంటబెట్టుకొని నర్మదానదీ తీరాన పట్టపగలు మన్మధ క్రీడలు సల్పుతుండగా, సూర్యుడు బ్రాహ్మణ రూపంలో వచ్చి పగటిపూట రతిక్రీడలు నిషిద్ధమని హెచ్చరించాడు దాంతో జమదగ్ని కోపించి, రతిభంగమొనరించిన సూర్యుని రాహుగ్రస్తుడవై తేజోవిహీనడవవుదువని శపించాడు అంతట సూర్యుడు జమదగ్నికి ప్రతిశాపమిచ్చాడు. "మహర్షీ! మంచికి రాగ చెడు ఎదురైనది నన్ను అనవసరంగా శపించావు నా శాపఫలంగా, నీవు రాజుచే పరాభవింపబడి, అతడు ప్రయోగించిన అస్త్రములచే మరణించెదవుగాక!" అని సూర్యుడు శపించెను. జమదగ్ని రేణుకను తీసికొని తన ఆశ్రమమునకు వెడలెను. రేణుక జమదగ్ని అనుగ్రహంతో రుషణ్వతుడు, సుసేషణుడు, వసువు, విశ్వావసు, పరశురాముడను ఐదుగురు కుమారులను కన్నది.

ప్రతి నిత్యం రేణుక జలములకై నదికి పోయెడిది ఒకనాడు చిత్రరథుడను రాజు తన భార్యలతో జలక్రీడలాడుచున్నాడు రేణుక చూస్తూ నిలబడిపోయింది. ఏమరుపాటున కుండ క్రిందపడి పగిలిపోయింది రిక్తహస్తములతో ఆశ్రమమునకు తిరిగిరాగా జమదగ్ని జరిగినదంతయూ దివ్యదృష్టితో చూచి రేణుకకు మరణదండన విధించి, తన కుమారులను పిలిచి తల్లిని

చంపమన్నాడు ఎవరూ అందుకు అంగీకరించలేదు. పరశురాముడు మాత్రం ముందుకు వచ్చి, తండ్రి ఆదేశానుసారం తల్లిని సంహరించాడు అతని ధైర్యానికి మెచ్చుకొని, జమదగ్ని వరం కోరుకోమనగా, అంత పరశురాముడు తన తల్లిని బ్రతికించమన్నాడు. జమదగ్ని సంతోషించి రేణుకను బ్రతికించాడు.

కార్తవీర్యార్జునుడు ఒకనాడు సైన్యంతో జమదగ్ని ఆశ్రమమునకు రాగా, ఆ రాజుకు షడ్రసోపేతంగా విందు యిచ్చాడు జమదగ్ని. కార్తవీర్యార్జునుడు సంతసించి సురభిని ( కోరినవరములనిచ్చేది ) తన కిమ్మని కోరగా, జమదగ్ని అంగీకరించలేదు కార్తవీర్యార్జునుడు కోపించి జమదగ్నిపై దండెత్తాడు జమదగ్ని సురభివైపు క్రీగంట చూడగా, సురభి సైన్యాన్ని సృష్టించింది సురభి సైన్యము ముందు ఆ రాజు సైన్యం నిలువలేకపోయింది. ఇరువదిసార్లు పోరు సలిపినా, అన్నిసార్లు కార్తవీర్యార్జునుడే ఓడిపోయాడు. ఇక చేసేది లేక రాజు జమదగ్నిని సంహరించి సురభికొరకు గాలించాడు సురభి అంతకుముందే ఇంద్రుని వద్దకు వెళ్ళిపోయింది. రేణుక సహగమనానికి సిద్ధంకాగా భృగుమహర్షి జమదగ్నిని బ్రతికించాడు. దీనికి కారకుడైన కార్తవీర్యుని, పరశురాముడు సంహరించి ఆ వార్త తండ్రికి చెప్పాడు. అది వినిన జమదగ్ని, రాజును సంహరించుట దోషమని, పాప పరిహారార్థం ఒక సంవత్సరం తీర్థయాత్రలు చేయమని ఆదేశించాడు. పరశురాముడు శిరసావహించి తీర్థయాత్రలకు బయలుదేరాడు.

కార్తవీర్యార్జునుని కుమారులు తమ తండ్రి మరణానికి కారకుడైన జమదగ్నిని పట్టి చంపారు. ఆ సమయాన రేణుక రక్షించమని పరశురాముని ఇరువది ఒక్కసార్లు పిలిచింది తీర్థయాత్రలు పూర్తిచేసుకొని తిరిగివచ్చిన పరశురాముడు అంతా తెలుసుకొని చింతించాడు. కోపోద్రిక్తుడై పరశువు (గండ్రగొడ్డలి)ను చేబూని, ధరామండలాన ఉన్న క్షత్రియుడన్న వారందరినీ, ఇరువది ఒక్కసార్లు దండెత్తి సంహరించి తండ్రికి రక్త తర్పణ గావించాడు పరశురాముడు. భృగువంశీయులందరూ క్రోధమూర్తులే. కాని జమదగ్ని మాత్రం మహాశాంతమూర్తి. తనకు అపకారం జరిగినా ఉపకారం చేసేవాడు, ప్రశాంతజీవి. క్షమాశీలి. భృగు వంశానికే మణిదీపిక. అటువంటి జమదగ్నిని పితృదేవతలు ముంగిసయై జన్మించమని శపించారు. ఈ కథ మహాభారతంలో పూర్తిగా లభిస్తుంది. జమదగ్ని చరిత్ర పఠనీయమైనది.

## అంతర్వీక్షణ

దేహభ్రాంతులు విడనాడి దివ్యజ్ఞాన
పథమునందున పయనించి పరము గనుము
స్వప్న జగముల సంకెళ్ళ స్మరణ యేల
జ్ఞాన గంగలో స్నానంబు సలుపవోయి !

హాయి యనగనె నీ రూప మరయనేల
భ్రాంతి లోకాల పయనించ పాడిగాదు
పరుగుదీయుట యిక మాని పరుడవగుము
వేచి వినవోయి వేదాంత విజయభేరి

దివ్యజ్ఞాన వీధి తిరుగాడ నేర్వుము
భవము బాయు పథము పట్టి నడువు
కల్ల జగము నమ్మి కల్లోల పడనేల
జాగరిల్లవోయి ! జడతబాసి

– గుడిశేవ నరసింహారావు

# మనిషికి ఆరడుగుల నేలే ....

-కపుల ఆంజనేయశర్మ

ఒక మనిషి సుఖసంతోషాలతో జీవించడానికి ఎంత భూమి కావాలి? ఎన్ని ఎకరాల పొలం సరిపోతుంది? అనే సంశయం ఒక రాజుగారికి కలిగింది. మంత్రికి చెప్పి తన సందేహానికి సమాధానం అడిగారు.

మంత్రి ఆలోచించి కొద్ది రోజుల తరువాత చెబుతానన్నాడు. ఈలోగా ప్రజలకు ఒక ప్రకటన చేశాడు. "ఎవరైనా రైతు రాజు దగ్గరకు వచ్చి తాను సుఖంగా జీవించటానికి ఎంత భూమి కావాలో తీసుకోదలిస్తే, రాజుగారు యిస్తారు. ఆ వ్యక్తి సూర్యోదయ సమయంలో బయలుదేరి తనకు కావలసిన భూమిని చుట్టి వచ్చి, సూర్యాస్తమయంలోగా బయలుదేరిన చోటుకి వచ్చి చేరినట్లయితే ఆ భూమి అతనికి ఇవ్వబడుతుంది" అని దండోరా వేయించాడు

ఒక రైతు వచ్చాడు బుట్టెడు సున్నం, మధ్యాహ్నానికి భోజనం వెంట తీసుకొన్నాడు. సూర్యోదయం కాగానే బయలుదేరాడు. తనకు ఎంత భూమి కావాలి అని ప్రశ్నించుకున్నాడు. "ఒక వెయ్యి ఎకరాలైనా ఉండకపోతే సరిపోదు. ఉండటానికి ఇల్లు, వసతులు కావాలి కదా!" అనుకున్నాడు నడిస్తే ఎక్కువదూరం తిరగలేనని పరుగెత్తడం ఆరంభించాడు తానే గాక తన భార్య, బిడ్డలకు కూడా సరిపడే భూమి సంపాదించుకోదలిచాడు. తన బిడ్డలకు కలిగే సంతానం, మళ్ళీ వాళ్ళకు కలిగే సంతానం — మొత్తం ఏ వందమందికో ఆస్థి సంపాదింపదలిచాడు వెళ్ళే త్రోవలో గుర్తుగా సున్నం వేసుకొంటూపోతున్నాడు. లక్ష ఎకరాలైనా కావలసివుంటుందనుకొన్నాడు

అన్నం తింటే కాలం వృధా అవుతుందని తినలేదు. ఈ ఒక్కరోజూ కష్టపడితే ఇక జీవితమంతా సుఖమేననుకొన్నాడు. ఇన్ని ఎకరాలని లెక్క ఏమిటి? చీకటి పడేలోగా శక్తి వున్నంతవరకు పరుగెత్తుదామనుకొన్నాడు.

సూర్యుడు ఏటవాడుతున్నాడు. ఇకనైనా వెనక్కు తిరగకపోతే బయలుదేరినచోటుకు చేరలేనని గ్రహించాడు. అలసిపోయాడు రోజల్లా పరుగెత్తడంతో కాళ్ళు దడబడపడుతున్నాయి. గమ్యస్థానం చేరకముందే అలసటతో పడిపోయి మరణించాడు

రాజుగారి ప్రశ్నకు జవాబు దొరకలేదు. మంత్రి ఆ రైతు వద్దకు వెళ్ళాడు. అతని శవాన్ని పూడ్చిపెట్టడానికి బంధువులు వచ్చారు శవ పేటికలో శవాన్ని అమర్చారు. తీసుకొనివెళ్ళి ఆరు అడుగుల పొడవు గల గోతిని తీసి అందులో పూడ్చిపెట్టి మట్టి కప్పారు

మంత్రి "ఇప్పుడు సమాధానం దొరికింది" — అన్నాడు రాజుతో. "ఏమిటి సమాధానం" — అన్నాడు రాజు. మనుష్యునికి ఆరడుగుల భూమి కావాలి" — అన్నాడు మంత్రి.

మనుష్యునికి గల కోరికలకు పరిమితిలేదు. అతని కోరికల వల్లనే అతడు పతితుడవుతున్నాడు వాటిని అదుపులో పెట్టుకోగలిగినవాడే ఉత్తముడు

ఈ కథను రష్యన్ రచయిత టాల్‌స్టాయ్ వ్రాశాడు.

## గ్రంథాలయములకు మనవి

శ్రీవాణి ప్రారంభించినప్పటి (జనవరి 85) నుంచి ప్రతి నెలా ముద్రించబడి అందరికి పంపబడుతున్నది. కొన్ని గ్రంథాలయములకు అందటం లేదని బిల్లుల మొత్తంలో కొంత తగ్గించి పంపుతున్నారు. ఏ గ్రంథాలయమునకైనా అందకపోతే, తెలియబరచినయెడల వెంటనే ఆనెల శ్రీవాణి పంపబడుతుంది. బిల్లుమొత్తం తగ్గించవద్దని మనవి చేస్తున్నాం. — సం.॥

# అనుకున్నంత తేలికకాదు విద్యాబోధన

( గత సంచిక తరువాయి )

—— బోధించుమని చెప్పటం తేలికే. బోధనాపద్ధతులను రూపొందించటం సాధ్యమే కావి, పరిస్థితులను కల్పించటం అంత సులభం కాదు. ప్రయత్నిస్తే అది కూడా సాధ్యమే కావచ్చు కాని, విద్యాబోధనలో, సాధనలో చిత్తశుద్ధిమాత్రం బయట నుండి తెచ్చి పెట్టేది కాదు, లోపల నుండి పుట్టి వికసించేది

స్వామి వివేకానందులు విద్యను గురించి ఇలా వివేచించారు. "విద్య రెండు రకాలు ఒకటి - విషయ వివరాలు అందించేది రెండు —జీవన వ్యవస్థను తీర్చి దిద్దేది మొదటిదానివలన ప్రకృతిలో ఉన్న వార్తలు, విశేషాలు, వాటి స్థితిగతులూ తెలుస్తాయి అది ఎటువంటిదంటే, రెండుపాళ్ళ హైడ్రోజన్ ఒక పాలు ఆక్సిజన్ కలిస్తే నీరు అవుతుంది అని చెప్పేది రెండవది నీరు ఎలా ఏర్పడుతుందో చెప్పేది కాదు నీటి యెద్దడి యేర్పడ్డప్పుడు దొరుకుతున్న కొద్దిపాటి నీటిని అందరూ ఎలా పంచుకోవాలో నేర్పేది. "

మొదటిది భౌతిక పరిజ్ఞానానికీ, రెండవది శీల నిర్మాణానికి సంబంధించింది. విద్యాబోధన ఈ రెండు అంశాల్లోనూ వేరువేరుగా సాగుతుంది కాని నిజానికి ఈ రెండు రకాలను మేళవించుకొని సాగాలి. అందువల్లనే విద్యాబోధన అనుకున్నంత సులభం కాదు.

బోధనవల్లనే జాతి శీలం రూపొందుతుంది. జాతి శీలంలోనుంచి సంస్కృతి వికసిస్తుంది సంస్కృతిని రక్షించుకుంటూ పరిణామాన్ని సాధించేదే నాగరికత. నాగరికత మానవుడు నిర్మించుకొనే సామాజిక ప్రగతికి చిహ్నం ప్రగతికి ప్రాణం శీలం శీల నిర్మాణమే విద్యాబోధన సాధించే లక్ష్యం వివరాలు కాదు విద్యకు లక్ష్యం. వివరాలను వివేచించే వివేకం విద్య. వివరాలు చెప్పేవిద్యకే ఎన్నో తంటాలు పడాలి విద్యార్థుల బుర్రలను Information తో నింపి కంప్యూటర్ సెంటర్‌గా మార్చటానికి కూడా ఉపాధ్యాయులు ఎంతో కృషిచేయాలి కాని, కంప్యూటర్ సెంటర్లన్నీ సంస్కృతి కేంద్రాలు కావు విద్యార్థి విద్యావంతుడైనా, ఉత్తమమానవుడు గాని సరియైన పౌరుడు కాని కాకపోవచ్చు విద్యార్థి గొప్ప పరిశోధకుడై ఎన్నో భౌతిక సత్యాలను వెలికితీసి లోకానికి అందించినా మానవత్వపు విలువలను లోకంలో పాటించలేక పోవచ్చు.

విద్యార్థిని మనిషియైన మనీషిగా రూపొందించటం విద్యాబోధన పరమార్థం మనీషిగా మార్చటం యాంత్రికంగా అభ్యాసంవల్లసాధించవచ్చు మహనీయుడైన మానవుణ్ణిగా మార్చటం అధ్యాపకుడు తాను స్వయంగా మానవతా విలువలను సాధించి, ఆచరించి చూపించటంవల్లనే సాధ్యమవుతుంది నేటి సమాజంలో అధ్యాపకుడు విషయాన్ని పుష్కలంగా బోధిస్తే చాలు అనే భావమే ప్రచారంలో ఉన్నది. కాని, విద్యాబోధన ఆలోచనతో మాత్రమే ఆగిపోకూడదు. ఆచరణలోకి వచ్చి లోకానికి తోడ్పడాలి అలా సాధించటం అంత తేలికైన పనికాదు.

మానవునికి విద్య ద్వితీయ జన్మను ప్రసాదిస్తుందని భారతీయులు విశ్వసిస్తారు వారి దృష్టిలో విద్య జీవనోపాధికి మార్గం మాత్రమే కాదు, చిత్త సంస్కారానికి చింతామణి ఉత్తమ పౌరుని తయారుచేయడానికి ఉతమ సాధనం. నేటి విద్యావిధానం సమాచార ప్రసారానికి సాధనంగా ఉపయోగపడుతున్నది జ్ఞాపకశక్తికి యాంత్రికశక్తిలా సహకరిస్తున్నది. విద్యాలయాలు విద్యర్థులను పరీక్షలకు తయారుచేసే యంత్రాగారాల్లా మారాయి శీల నిర్మాణానికి తోడ్పడే నీతివిద్య నేడు కరవైపోయింది సమాజశ్రేయస్సును సాధించవలసిన విద్య సమాజనీతినికూడా కనీసం అందించలేకపోతున్నది డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడన్నట్లు— "మనం ఒక నాగరికితను నిర్మించుకొంటున్నాం అది కర్మాగారం కాదు, వర్క్‌షాప్ కాదు. నాగరికతయొక్క నాణ్యత భౌతిక వస్తు సంభారంవల్లగానీ, రాజకీయ

యంత్రాంగంవల్లగానీ, ఏర్పడదు. మానవుల శీల సంపదమీద ఆధారపడిఉంటుంది. విద్యయొక్క ప్రధాన కర్తవ్యం ఉత్తమ శీలసంపద పెంపొందించటం" స్వాతంత్ర్యం వచ్చి నాలుగున్నర శతాబ్దాలయినా ఈ ఆదర్శం అమలుజరుపబడలేదు. నానాటికీ విద్యా విధానం శిథిలమైపోతున్నది.

మన తరంలో విద్యాలయాలు పెరుగుతున్నాయి అయినా, విద్యాప్రమాణాలు దానికి దీటుగా పెరగటం లేదు బోధన విధానాలు సరికొత్త పద్ధతులలో రూపొందింపబడుతున్నాయి, కాని వాటిని ప్రయోగించటంలో చిత్తశుద్ధి అంతగా పెంపొందటంలేదు విషయ వివరాలను ఎన్నింటినో అందింపగలుగుతున్నాం కాని, వ్యక్తిత్వ వికాసంమీద అంత శ్రద్ధ చూపలేకపోతున్నాం. జీవన సౌకర్యాలమీద ఆసక్తిని పెంచుతున్నాం గాని, జీవితగమ్యాల మీదకు దృష్టిని మళ్ళించలేక పోతున్నాం ప్రపంచ పరిజ్ఞానాన్నంతా ఆపోశన పట్టిస్తున్నాంగాని, దేశసమైక్యతను గురించి, సాటివారిని ప్రేమించే ఔదార్యాన్ని గురించీ, త్యాగాన్ని గురించీ, శీలాన్ని గురించీ ఒక్క ఉదాత్తాంశాన్ని బోధనాంశాలలో గాని, విద్యాబోధనలోగాని జీర్ణింపచేయలేకపోతున్నాం విద్యాబోధన మెదడును మెప్పిస్తున్నది కాని, మనసును పండించటంలేదు ఆది సాధించాలంటే అనుకున్నంత సులభమైన పనికూడా కాదు అట్లని ఉపేక్షింప తగిందీ కాదు

"మనస్సుకూ, శరీరానికీ, ఆత్మకూ సంబంధించినదిగా విద్యాబోధన ఉండాలి" అన్నారు మహాత్మాగాంధీ ఆ లక్ష్యంతో ముందుకు సాగుదాం,సులభం కాకపోయినా ప్రయత్నించి సాధిద్దాం ! ○

( 8 వ పేజీ తరువాయి )

తత్త్వము అర్ధమవుతుంది. మానవుడు పుట్టిన మొదలు గిట్టేంతవరకు కేవలం ఆహార నిద్ర నిమిత్తమై పాకులాడుతున్నాడు ఈ విధంగా పాటు పడుతుండటంవలన తాను ఏమి సాధించినట్లు

" నిదుర నుండి లేచి మరి నిద్దురపోయెడు
దారి పొట్టకై
హద్దును పద్దు లేక వ్యయమందగ చేయును
జీవితంబు నీ
విద్దెల ధారపోసి అరవింద దళాక్షుని
విస్మరించి ఏ
పెద్ద సుఖంబు నొందితిరో ప్రీతిగ యోచన
చేయు మానవా "

ఓ మానవుడా! నీవు దేనిని సాధించావ్? భగవంతుని విస్మరించి,కేవలం ఈ భౌతికమైన జీవితాన్నే విశ్వసించి ఏమి సాధించావ్? ఒక్కసారి కనులు మూసుకొని విచారణ చేస్తే సాధించినది ఒక్కటీ లేదు కాని సాధించినది దుఃఖమే, విచారమే. చదువుతున్నావు గ్రంధాలు. ఎన్నో గ్రంథాలు చదివావు, ఎందరు మహనీయులనో దర్శించావు. ఎన్ని యాత్రలో చేశావు. ఎన్ని సత్కర్మలో ఆచరించావు కాని సాధించినది ఏమిటి ?

" పుస్తకముల్ పఠించితిని పూర్తిగ చూచితి
సర్వశాస్త్రముల్
నిస్తులమైన విద్యలను నేర్చితినంచును
గర్వమేల నీ
హస్తయుగంబు మోడ్చి పరమాత్ముని
చింతన చేయలేని
ఈ నిస్తులమైన జీవితము నిష్ప్రయోజనము
కాదె మానవా !"

ఇదంతా నిష్ప్రయోజనం ఏమి చదువులు యీ చదువులు ? ఏమి పూజలు యీ పూజలు ? ఏమి విశ్వాసము యీ విశ్వాసము ? దీనివలన కలిగిన ఫలిత మేమిటి ? విచారణచేస్తే ఏమీ కనిపించటంలేదు. అప్పటికప్పుడు ఆనందాన్ని అందించినప్పటికినీ, కానీ సత్యమైన నిత్యమయినటువంటి ఫలితం మనలో

సూన్యమైపోతున్నది. కనుక ఇవన్నీ కూడనూ మానసిక వికారములు, మనస్సుయొక్క ప్రభావములే నేను గొప్ప ఉద్యోగం చేస్తున్నాను, గొప్ప పదవిలో ఉంటున్నాను, నేను అధికారిని– యీ విధంగా భావించడమే గొప్ప పాపం. సర్వమూ దైవత్వముతో అనుభవించేటటువంటిదని విశ్వసించేటటువంటివాడే నిజమయినటువంటి అధికారి. ఆ సత్యాన్ని మానవుడు గుర్తించుకోలేకపోతున్నాడు మనసునందు ఒకటి, మాటయందు మరొకటి. క్రియయందు మరొకటిగా ఉండటంచేతనే మానవత్వం దానవత్వంగా మారిపోతున్నాది

ఒకానొక సమయంలో ఆదిశంకరులు దిగ్విజయ యాత్ర సల్పి పుణ్యక్షేత్రమయిన కాశీపట్నం చేరుకున్నారు కాశీ విశ్వేశ్వరుని ప్రార్థిస్తున్నారు ( ఓ ఈశ్వరా ! నా పాపములను పరిహారంగావించుకొనే నిమిత్తమయి నేను యిక్కడికి వచ్చాను") అని ప్రార్థిస్తున్నారు. ఆదిశంకరులు సాక్షాత్ శంకరస్వరూపులు గదా ! యీయన ఏ పాపం చేశారు ? నిరంతరమూ వేదములూ, శాస్త్రములూ ఉపనిషత్తులూ ఇతిహాసములు అధ్యయనం చేస్తూ ఆధ్యాత్మిక మార్గంలో నే పయనిస్తున్న శంకరులు చేసిన పాపమేమిటి ? అని శిష్యులు ఆశ్చర్యపోతున్నారు కాని ఆదిశంకరులు ప్రార్థిస్తునే ఉన్నారు " నేను మూడు పాపములు చేశాను శంకరా ! ఆ మూడు పాపములూ పరిహారం గావించుకోవటానికి ఇక్కడికి వచ్చాను మొదటిది " యదోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ " ... "ఓ శంకరా! భగవంతుడు మనస్సునకు వాక్కునకు అతీతమయినవాడని నాకు తెలుసు తెలుసుకున్నానే గాని ఆచరణలో పెట్టలేకపోతున్నాను. నిన్ను వర్ణించడం అసాధ్యమనుకున్నాను. కాని " ఈశ, గిరీశ, పరేశ, నరేశ విలేశయ భూషణభో ! సాంబసదాశివ, శంభోశంకర, శరణం మే తవ చరణ యుగం. " అని నిన్ను వర్ణిస్తున్నాను ఇది పాపం కాదా ! నీవు వాక్కుకు అతీతమయినవాడవని తెలుసుకున్నాను. తెలుసుకున్న దానిని నేను ఆచరణలో పెట్టకుండా, వర్ణించటానికి ప్రయత్నము చేస్తున్నాను ఇది తలచినది, చెప్పినది వేరుగా ఉండటం చేత ఇది పాపమే ఇక రెండవ పాపం ఏమిటి ? " ఈశ్వర స్సర్వభూతానాం, ఈశావాస్య మిదం సర్వం వాసుదేవం సర్వమిదం " అని చెబుతున్నాను, విశ్వసిస్తున్నాను కానీ నిన్ను దర్శించటానికి కాశీకి వచ్చాను నేను చెప్పేది ఒకటి, తలచేది ఒకటి చేసేది మరొకటిగ చేస్తున్నాను ఇదీ కూడా పాపమేగదా ! ఇక మూడవ పాపమేమిటి ? " ఏకాత్మ సర్వభూతాంతరాత్మ " నీ యందు నా యందు ఉన్నది ఒకే ఆత్మనే. " ఏకం యేవ అద్వితీయం బ్రహ్మ " ఉన్నది ఒక్కటే, రెండోది లేదు. యీ విధమయిన దాని మీద నాకు సంపూర్ణమయిన విశ్వాసం ఉన్నది నీవూ, నేనూ – ఇద్దరం ఒక్కటే కానీ నిన్ను దర్శించటానికి యీ దేహం వచ్చింది ఒక్కటే యని విశ్వసించి భిన్నంగా నిన్ను చూస్తున్నాను ఇది మూడవ పాపం కనుక " యీ మూడు పాపములను పరిహారం చేసి నాకు అద్వైతసిద్ధాంత ఏకత్వమనేటటువంటి దివ్యత్వాన్ని నాకు ప్రసాదింపుము అని శంకరులు కోరారు. చూశారా ! పాపమంటే కేవలం పరులను నిందించడం గాని, పరులను హింసించడం గాని, దూషించడంగాని కాదు పాపం చెప్పటం ఒకటి, తలచటం మరొకటి – ఇదే పాపం యీ పాపములను మనం పరిహారం గావించుకోవాలి. యీ పాపములను ఏనాడు పరిహారం గావించుకుందుమో, మనోవాక్కాయముల మూడింటి యొక్క ఏకత్వమును మనం ఏనాడు అనుభవించుదుమో – ఆనాడే పూర్ణమానవుడవుతాడు.

కనుకనే ఉపనిషత్తులు "మనస్యేకం, వచస్యేకం కర్మణ్యేకం మహాత్మా ! " " మహాత్ముడనగా ఏమిటి ? మహ + ఆత్మ దివ్యమయినటువంటి ఆత్మ స్వరూపం. అట్టి ఆత్మస్వరూపుడు కాకుండా " మనస్

అన్యత్, వచస్ అన్యత్, కర్మణ్ అన్యత్, దురాత్మనమ్" దురాత్ములుగా మారిపోతున్నాం. మానవుని ఉన్నతిస్థాయికి గొనిపోవునదీ మనస్సే అధో స్థాయికి నెట్టునదీ మనస్సే. కనుక మనస్సు నుమనం ఆధీనంలో పెట్టుకుంటే, స్వాధీనంలో వుంచుకుంటే సర్వమునకూ మనమే అధిపతులమవుతాం. మనస్సును ఆధారం చేసుకోవటం కాదు, అధీనం చేసుకోవాలి. అదే ఈనాడు మనం చేయవలసిన పని. ఈ మనస్సు లేకుండా మనిషి లేడు. మనిషి లేకుండా ప్రపంచమే లేదు. కాబట్టి మనస్సు, మనిషి, ప్రపంచం— ఈ మూడూ ఒక్కటే అయితే ఎందుకు ఈ మూడు రూపములు? ఈ మూడు నామములు ఎందుకు? అయితే మన ప్రవర్తనను పురస్కరించుకొని ఈ రూపనామములు భిన్నంగా వస్తున్నాయి ఎట్లా?. ఒకే బ్రాహ్మణుడు వంట చేస్తుంటే వంట బ్రాహ్మణుడు అంటారు. దేవుని గుళ్ళో పూజ చేస్తుంటే పూజారి బ్రాహ్మణుడు అంటారు. పంచాంగం చెబుతుంటే పంచాంగం బ్రాహ్మణుడంటారు. బ్రాహ్మణుడు ఒక్కడే. తాను చేసే కర్మలను పురస్కరించుకొని ఈ పేర్లు వస్తున్నాయి.

మానవుడు, మనిషి, ప్రపంచం, విశ్వం— ఇవన్నీ కూడనూ చేసేటటువంటి ప్రవర్తనను పురస్కరించుకొని యీపేర్లు వివిధ రూపములలో వస్తున్నాయి ప్రపంచము ఏమిటి యీ ప్రపంచం? పంచభూతముల వికాసమే ప్రపంచం. అనగా యీ ప్రపంచంలో పంచభూతములను వికసింపజేసుకుంటున్నాం ఈ పంచభూతములు ఏకత్వంగా వించుకోవటంలేదు. వికసింపజేసుకుంటున్నాం భిన్నంగావించుకుంటున్నాం ఏకత్వాన్ని అనేకత్వంగా చేస్తున్నాం. అందువలననే ఈ ప్రపంచం విశాలంగా పెరిగిపోతున్నాది. కాని అనేకత్వంలో వుండినటువంటి ఏకత్వాన్ని దర్శించడమే మానవుని ప్రధాన లక్ష్యం. అన్నిటియందు వుండినటువంటి ఏకత్వాన్ని మనం విశ్వసించాలి. యీస్థానంలో అనేకమంది కూర్చొన్నారు. అనేకమందిలో వున్నటువంటి ఏకత్వాన్ని మనం గుర్తించాలి. అదియే Beings are many but breath is one నీ గాలి, నా గాలి నీయొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసములు, నాయొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసములు వేరు కావటంలేదు. అందరూ ఒకే గాలి తీసుకోవటం, ఇచ్చుకోవటంగా ఉంటున్నాది. ఇందులో వున్నటువంటి ఏకత్వాన్ని గుర్తించండి అన్ని దేహములూ రథములుగా ఉంటున్నాయి అతనే (ఆత్మ) రథికుడు. దేహాలు రథములు. రథములు భిన్నంగా ఉంటున్నాయి. కానీ రథికుడు (ఆత్మ) ఒక్కటే. ఇదే అనేకంలో ఉండినటువంటి ఏకత్వం

మానవులు అనేక విధములుగా ఉంటుంటారు. కాని అనేకత్వంలో ఉండినటువంటి ఏకత్వాన్ని మనం దర్శించాలి అందరికీ తప్పనిసరిగా ఉండేటటువంటివి ఉంటున్నాయి. ఆ ఏకత్వాన్ని మనం గుర్తించాలి. కోటీశ్వరుడు ఆకాశం నుండి ఉట్టిపడలేదు కూటిపేద మట్టి నుంచి పుట్టి రాలేదు కూటి పేద, కోటీశ్వరుడు తల్లి గర్భమునుంచే పుట్టారు. ఇది ఏకత్వం కూటి పేద అంబలిగంజి త్రాగవచ్చు. కోటీశ్వరుడు పంచభక్ష పరమాన్నములు భుజించవచ్చు. అన్నములు వేరు ఆకలి ఒక్కటే కోటీశ్వరునికి గాని కూటి పేదకు గాని మరణం ఒక్కటే. కోటీశ్వరుడు కూల్ డ్రింక్ త్రాగవచ్చు. కూటిపేద కాల్వలో ప్రవహించు జలమును గ్రోలవచ్చు. జలములో భిన్నత్వముంటున్నది కాని దాహంలో భిన్నత్వంలేదు. కనుకనే అనేకత్వంలో ఉండినటువంటి ఏకత్వాన్ని మనం చక్కగా విచారణ చేస్తే – ఇదే నిజమైన దివ్యత్వానికి మూలాధారము. కానీ యీనాటి మానవుడు ఆ విధమయినటువంటి జీవితాన్ని గడపటం లేదు. ఉద్యోగాలు పెరిగినకొలది 'అహం' చాలా మితిమీరిపోయి, అపమార్గములలో ప్రవేశించి, అన్యాయ అక్రమ అనాచారములకు లోనై జీవితాన్ని భ్రష్టు పట్టించుకుంటున్నారు. ఇది కాదు మానవ జీవితం మన అధికారం పెరిగిన కొలది ఆత్మ

## ప్రశ్నలు-సమాధానాలు

1 1991 జనాభా లెక్కల ప్రకారం దేశ జనాభా
2 బ్రిటన్‌లో అతి చిన్న వయస్సులో డిగ్రీ పూర్తిచేసిన (13 ఏళ్ళు) భారతీయ సంతతి బాలుడు ?
3 తాత్కాలిక బడ్జెట్‌కు మరో పేరు ఏమిటి?
4 ప్రభుత్వ ఆదాయాలను జమ చేసే ఖాతా ఏది?
5 'ఈవెనింగ్ స్టార్' అని ఏ గ్రహమును అందురు ?

1) 84,39,30,861 2) గణేష్ సిత్తమ్ పాలెమ్ 3) ఓట్ ఆన్ అకౌంటు 4) కన్సాలిడేటెడ్ ఫండ్ 5) వీనస్

తత్త్వము కూడా దానితో పెరగాలి ఉత్తమ భావాలు అభివృద్ధి కావాలి. కాని అట్లు కావటం లేదు ఆధ్యాత్మిక రంగంలో గాని, పారమార్థికరంగంలో గాని, ధార్మిక రంగంలోగాని, నైతికరంగంలోగాని, భౌతికరంగంలో గాని – అన్ని రంగములలో మానవుడు ఎంత ఉన్నత స్థాయికి పోతున్నాడో, అంత ఉన్నత భావాలు కూడా పెరగాలి కాని ఈనాటి మానవునకు ఉన్నతి భావాలు రావటం లేదు హీన భావములు వస్తున్నాయి హీన చర్యలలో పాల్గొంటున్నారు. అప్పటికప్పుడు తాత్కాలిక ఆనందాన్ని అనుభవిస్తున్నట్లుగా నటన చేస్తున్నారు గాని, 'ముందున్నదిర తొందరపోనే ముసలి తనమున ముసళ్ళ పండుగ' అన్నారు ముందున్నది ఈ బాధలు. ఈ తోలుబొమ్మ నిమిత్తమై ఎందుకు నీవు తొందరపడతావు ? కనుక ఆధ్యాత్మిక మార్గంలో ఈ పవిత్రమైన ఉన్నత విషయాలను మొట్టమొదట గుర్తించటానికి ప్రయత్నించాలి. కనుక అన్నిటికీ మనసే కారణం కనుక మనసును అదుపులో పెట్టుకోవాలి. మనసు చెప్పినదంతా వినకూడదు కొంత సమయం తీసుకొని విచక్షణాజ్ఞానంతో ముందుకుపోవాలి కాని ఈ విచారణకు సమయం తీసుకోవటం లేదు. మనసు చెప్పిన తక్షణమే అమలుపరుస్తున్నారు. ఇది మానవునికి సరియైన మార్గం కాదు.

మానవుడు ఈ మనస్తత్త్వమును చక్కగా గుర్తించటానికి ప్రయత్నించినప్పుడే మానవుడు దేవుడుగా రూపొందుతాడు. మా-న-వ అనగా ఏమిటి? దే-వు-డు అనగా ఏమిటి? దినము కానివాడు దేవుడు Day (డే) అనగా ఏమిటి? రాత్రింబవళ్ళు అని అర్థం. కనుక రాత్రింబవళ్ళు లేనివాడు 'దేవుడు'. రాత్రింబవళ్లతో కూడినది 'దినము'. దినమునుండి వచ్చినది దైనము. కనుక భగవంతునికి రాత్రింబవళ్ళు లేవు. సుఖదుఃఖములులేవు పాపపుణ్యములు లేవు అధిక అల్పత్వములులేవు అంతా సమత్వమే అటువంటి భగవత్ తత్త్వాన్ని మనం విశ్వసిస్తూ, ఆరాధిస్తూ, అలాంటి భగవంతునికి ఎలాంటి కళంకములు ఆపాదించకూడదు మనయొక్క నడతను పురస్కరించుకొనియే భగవంతునికి కూడనూ చెడ్డపేరు వస్తుంది కాని భగవంతునికి ఏమాత్రం చెడ్డపేరు రాదు భగవంతుడు దేనికిని లొంగడు అన్నింటికినీ అతీతమైన స్థితిలో ఉండేటటువంటివాడు. ఏనుగును ఎక్కి ప్రయాణం చేస్తుంటే కుక్కలు చూచి మొరుగుతాయట కుక్కలు మొరుగుతుంటే ఏనుగు తోకకూడా అల్లాడించదు కనుక దైవత్వానికి వచ్చే నష్టమేమిటి? అంతా నీకే నష్టం. నీవే నష్టపోతున్నావు. అలా కాకూడదు దైవాన్ని విశ్వసించినట్టి మానవుడు దివ్యమైన ప్రవర్తనలో జీవితాన్ని గడుపుతూ రావాలి భగవంతుడు ప్రేమస్వరూపుడు Love is God, Live in Love.

Start The Day With Love
Fill The Day With Love
Spend The Day With Love
End The Day With Love
This is The Way To God

(బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో ది 25-5-93 న భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగమునుండి)

# అనుగ్రహమూర్తి

శ్రీ సచ్చిదానందస్వామి

స్వపర భేదాల విస్మృతి పొందుచే ఆత్మ. అదే పరమాత్మ. భగవంతుడు దయామయుడు. ప్రేమ స్వరూపుడు అతనిని తెలిసికొనుటకు ప్రేమస్వరూపులే కావలయును గదా! స్వామి సంగతి కొంతవరకు సాధన చేసిన వారలకే తెలుస్తుంది. అందులకే శ్రీకృష్ణ పరమాత్మ "సాధుల హృదయము నాయది, సాధుల హృదయంబు నేనే జగముల నెల్లన్ - సాధుల నేనెరుంగుదును సాధులెరుంగుదురు నన్ను జగములనెల్లన్" అని తెలియజేసెను ఒక డాక్టరు సంగతి డాక్టర్కు, ఒక ఇంజనీరు సంగతి ఒక ఇంజనీరుకు మాత్రమే తెలియును గదా! ఆవరణ, అవధిలేని అనుగ్రహమూర్తియైన బాబాను అర్థము చేసికొనుటకుగాని గీతాసారము నర్థముచేసుకొనుటకుగాని ఎంతో పుణ్య సంస్కారమవసరము భగవంతుని గాథ, బోధ రెండు సాధకులకవసరమే గాథ వింటే ఆనందము. బోధ ఆచరిస్తే ఆనందము. అందులకే శ్రీరాముడు చేసినట్లు చేయాలి శ్రీకృష్ణుడు చెప్పినట్లు చేయాలి బాబా బోధ గీతాబోధ- "God and his name are identical" భగవంతునకు భగవద్వేషికి అవినాభావ సంబంధముండును కేవలము భగవంతుని గాథే ప్రధానము కాదు బోధనగూడ అవసరము

తింటే రుచి తెలుస్తుంది. దిగితే లోతు తెలుస్తుంది. పుట్టపర్తికి వెళ్ళి బాబాను ఒకమారు దర్శనము చేసుకొంటే తప్ప బాబా అవతార రహస్యము కొంతవరకు తెలియదు. అందులకే అన్నారు తిని చెప్పిన దానికి విని చెప్పిన దానికి భేదముంటుందని అనుభవములేని వారి ప్రశ్నలకు ఆధారముండదు. కృతిమమైన భక్తి సంకేతములనెన్ని నేర్చినను చిత్తశుద్ధి నటించలేము. "Face is the index of the mind" ముఖవర్చస్సే బ్రహ్మవర్చస్సును తెలియజేయును గదా! ముఖము సంగతి అద్దమే తేల్చిచెప్పును. ఇతరుల సహాయముతో గ్రంథములు వ్రాయవచ్చును ఉపన్యాసములు నేర్వవచ్చును. కాని చిత్తశుద్ధి స్వప్రయత్న సిద్ధి. బాబా బాహ్యప్రియుడు కాదు భావప్రియుడు అందులకే హృదయ విహారా! బడాచిత్తచోర! యనే నామసంకీర్తన తెలియపరుస్తుంది. బాబాలోగల నూటికి నూరుపాళ్ళ చిత్తశుద్ధి, పరిపూర్ణ ప్రేమ గమనించినవారికే తెలుస్తుంది. వారి చిరునవ్వు ఒక విద్యుత్ ప్రవాహము. అది మానవునిలో ఉత్తేజమును, ఊరటను కలిగిస్తుంది మనసుతో అహోరాత్రములు కుస్తీ పట్టుచున్న సాధకులకు, ముక్తపురుషులకు బాబా దగ్గరివాడు చిత్త చాంచల్యమున్న వారలకే మనన నిధి ధ్యాసనములవసరము. ఒట్టి మనన నిధి ధ్యాసములు సంకల్ప (ప్రవేశ) జన్మలైన శ్రీరామునకు, శ్రీకృష్ణునకు, బాబాకు అవసరములేవు అవి ప్రారబ్ధ జన్మములు కావు. లీలాజన్మలు తల్లి, తండ్రి నిమిత్త మాత్రులే అవతారము ఉన్నత స్థానమునుండి క్రింది స్థాయికి దిగివచ్చును లోకకల్యాణ నిమిత్తమే అవతారము దిగివచ్చును. బాబా అనుగ్రహము ఒక్కొక్కరికి ఒక్కొక్క రీతి పనిచేయును. ఇవి భక్తి శ్రద్ధలను బట్టి, చిత్తశుద్ధినిబట్టి యుండును బాబా కొందరిని తన మహిమలతో, మరికొందరిని బోధలతో మార్చెదరు ఇదే అనుగ్రహమూర్తియొక్క లక్షణము. అవతారమూర్తియొక్క నిదర్శనము. ○

# ఆంధ్రప్రదేశ్‌లో ....

# చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధికి ....

* వినోదపు పన్ను రాయితీ...
* పూర్తిగా రాష్ట్రంలో నిర్మించే చిత్రాలకు 5 పర్సంటేజి పాయింట్లు...
* అందులో తక్కువ బడ్జెట్ చిత్రాలకు తిరిగి 50 శాతం వరకు వినోదపు పన్నులో రాయితీ....
* రాష్ట్రంలో నిర్మించే తెలుగు చిత్రాలలో అశ్లీలానికి, హింసకు ప్రాధాన్యం లేకుండా వున్న చిత్రాలకు ఒక్కొక్కరికి మూడు లక్షల రూపాయల వరకు సబ్సిడీ....
* సబ్సిడీ చెల్లింపులకై మూడుకోట్ల రూపాయల విడుదల....
* తెలుగు చిత్రసీమలోని కళాకారులు, సాంకేతిక నిపుణులు, అల్పాదాయ వర్గాల వారికి స్వల్పకాలిక పద్ధతిపై గృహవసతి కల్పన....
* రాష్ట్రేతర ప్రాంతాలలో నివసించే తెలుగువారి కొరకు తెలుగు చలనచిత్రోత్సవాల నిర్వహణ....
* సినిమా థియేటర్ల నిర్మాణానికి దీర్ఘకాలిక ఋణాల మంజూరు...
* చలనచిత్ర నిర్మాణ వ్యవస్థాకల్పనకై అదనంగా మూడుకోట్ల 45 లక్షల రూపాయల విడుదల...
* ప్రభుత్వం అమలుపరుస్తున్న అభివృద్ధి కార్యక్రమాల ప్రచారానికి డాక్యుమెంటరీ న్యూస్ రీళ్ళ నిర్మాణం...

మీ కోసం ...

మీ సేవలో...




**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చలనచిత్ర అభివృద్ధి సంస్థ**

10-2-1, ఎ. సి. గార్డ్స్

హైదరాబాద్ – 500 028

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లిమిటెడ్

( 11 వ పేజీ తరువాయి )

రించాడు. అయితే ఏ కారణం వల్లనో మిగతా పర్వాలనీయన అనువదించలేదు. ఆ బాధ్యతను న మిత్రుడు మహారచయిత అయిన కాళీప్రసన్నసింహుకు అప్పగించాడు. కాళీప్రసన్నే పూర్తి మహాభారతాన్ని బంగ్లా గద్యంలో అనువదించాడు.

ఈశ్వరచంద్రుడ్ని గురించి ఎంత చెప్పినా అది స్వల్పమే అవుతుంది. ఈయన గొప్ప పండితుడు, రచయిత మాత్రమే కాదు, దయార్ద్రహృదయుడు, దానశీలి, సకల సద్గుణ సంపన్నుడు, సరళజీవి, సాధు పుంగవుడు. ఆనాటి కళాశాల–యూనివర్సిటీల విద్యా విధానాలతో, విద్యా సంస్కరణలతో ఈయనకు పరిపూర్ణ సంబంధాలుండేవి. అపార ప్రజాదరణతోపాటు ప్రభుత్వంనుండి అనేక సన్మానాలు, సనదులు, బిరుదులు అందుకొన్న మహనీయుడీయన. వాటిలో లండన్ ఏషియాటిక్ సొసైటీవారి గౌరవ సభ్యత్వం, విక్టోరియా మహారాణిచ్చిన హిందూ సామ్రాజ్య దళవాయి బిరుదు K C I E –Knight Commander of the Indian (Empire) ప్రధానంగా చెప్పుకొనదగినవి. సంఘ సంస్కరణలతోపాటు విశేషించి విద్యా సంస్కరణల విషయంలో ఈయన సాధించిన విజయాలనెన్నిటినో జిజ్ఞాస గలవారు ప్రత్యేకంగా చదివి తెలిసికొనవలసినదే గాని యిచ్చట ఆ వివరాలన్నిటినీ చర్చించడం సాధ్యపడదని మనవి చేస్తున్నాను.

రచనల్లో రచయిత చిత్తశుద్ధికి, మేలికతకు ప్రాధాన్య మివ్వని యీ రోజుల్లో, జీవితంలో విస్పష్టమయిన ఆదర్శాలకు గ్రహణం పట్టిస్తున్న ఈ రోజుల్లో, ఆకాంక్ష గల యువకులు తమ జాతి చరిత్రలో నిక్షిప్తం చేయ బడివున్న నిజాలను తెలిసికొనాలంటే యిటువంటి మహనీయుల గాథలు చదవాలి, చదివి తీరాలి.

( 12 వ పేజీ తరువాయి )

ఇక జగన్మాత పార్వతీదేవి. ఈవిడ వాహనం సింహము. వీరి పుత్రులు షణ్ముఖుడు, వినాయకుడు. షణ్ముఖుని వాహనం నెమలి. (చాలా సున్నితమయిన ప్రాణి) వినాయకుని వాహనం ఎలుక. చూడండి భార్యాభర్తల వాహనాలు విరుద్ధమైనవి. కాని అన్నీ అందరూ కలసి జగద్రక్షకులు.

వినాయకుడు నాగ యజ్ఞోపవీత ధారి

వినాయక చవితి రోజు ఎంత ఖర్చు చేసి పూజ చేశాము ? అనేది గాదు. ఆయనను చూసి ఏమి నేర్చుకున్నాము ? అనేది ముఖ్యము. ఆయన ముక్తి ప్రదాయకుడు. ఆహారము కూడ కుడుములు, ఉండ్రాళ్లు సాత్వికాహారము. ద్రవిడ భాషలో "పిళ్ళైయార్" అంటారు గణపతిని. "పిళ్ళై" అనగా "శిశువు" "యార్" అనగా శ్రేష్ఠ వాచకం. యీ "పిళ్ళైయార్" కొన్ని ఆంధ్ర ప్రాంతాలలో "పిల్లా వాడ్యు" గా వ్యవహరించి పూజిస్తున్నారు. వినాయకుని ముందు గుంజీలు తీసేదానికి మొదటివాడు శ్రీ మహావిష్ణువు అంటారు. ఒకప్పుడు ఆయన "సుదర్శనం" (చక్రం) వినాయకుడు నోట్లో పడేసుకున్నాడట. దాన్ని బయటకెలా రప్పించాలా అనే ప్రయత్నంతో విష్ణువు తన నాల్గు చేతులతో రెండు చెవులను పట్టుకొని వినాయకుని ముందు గుంజీళ్ళు తీయగా ఆ దృశ్యం వినోదకరంగా వుండి వినాయకుడు పడిపడి నవ్వగా చక్రం బయట పడిందట.

శ్రీ మహా గణపతిని అనేక దేశాలలో అనేక రూపాలలో అనగా నృత్య గణపతి, వాహనారూఢుడై ఇలా అనేక భిన్న రూపాలలో కూడా పూజింప బడుతూన్న ఎల్లరకూ ఆరాధ్యదైవమైన వినాయకుని వ్రతం భాద్రపద శుద్ధ చవితిరోజు జరుపుకుంటారు. ఈయనను దూర్వాయుగ్మం (గరిక), జిల్లేడు, మారేడు, నేరేడు మొదలైన పత్రాలతో పూజించుతారు. ఈ పత్రములన్నీ కూడా ఆరోగ్య ప్రదములే. బాలురకు మార్గదర్శకము, ఆరోగ్యప్రదము. పెద్దలకు ముక్తి దాయకము అయిన ఈ గణేశవ్రతాన్ని మనస్ఫూర్తిగా ఆచరించి తరించాలి.

# మహామహోపాధ్యాయ పండిత పట్టాభిరామశాస్త్రి

శివలింగం

శ్రీ శాస్త్రిగారు కాంచీపురం దగ్గర పొలసూర్ గ్రామంలో 1908 లో జన్మించారు తిరుపతి,వారణాసి లలో విద్యాభ్యాసం. గురువుగారైన మహామహోపాధ్యాయ చిన్నస్వామిగారి కుమార్తెను వివాహమాడినారు 1-9-992 రాత్రి గం 11-15 ని లకు ఢిల్లీ లోని ప్రైవేటు ఆసుపత్రిలో కన్నుమూశారు తిరుపతిలోని రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం ఛాన్సలరుగా పనిచేశారు. రాష్ట్రీయ వేదవిద్యా ప్రతిష్ఠాన్ వారు శాస్త్రిగారిని జాతీయ వేదాచార్యునిగా నియమించడం వారి ప్రతిభకు తార్కాణం బెనారెస్ హిందూ విశ్వవిద్యాలయంలో కొన్నాళ్ళు, జైపూర్ మహారాజా సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా పండిట్ మదన మోహన మాలవ్యాగారి సిఫారసుతో కొన్నేళ్లు 1952లో కలకత్తా విశ్వవిద్యాలయం ఆహ్వానంపై మీమాంసా దర్శన శాఖాధ్యక్షునిగా నియామకం చివరి దశలో వారణాసిలో 1975 నుంచి సాహిత్య మీమాంస తంత్ర శాఖాధ్యక్షులుగా, ఆచార్యులుగా గడిపారు 1973 లో భారత రాష్ట్రపతి, జగద్గురు శంకరాచార్యులు కంచివారి సత్కారాలు పొందిన మహానుభావుడు పద్మభూషణ్ అవార్డు గ్రహీత ఉత్తర ప్రదేశ్ సంస్కృత అకాడమీ వారు లక్షరూపాయలు ప్రతిష్టాకరమైన విశ్వభారతి అవార్డు ప్రదానం చేయడం విశేషం

సంపూర్ణానంద్ సంస్కృత విశ్వవిద్యాలయం బర్ద్వాన్ విశ్వవిద్యాలయంవారు మహామహోపాధ్యాయ డి. లిట్ డిగ్రీలు ప్రదానం చేశారు. దక్షిణ దేశంలో పుట్టి తూర్పు పడమర ఉత్తర భారతాలలో జీవించి జాతీయాచార్యుడుగా కీర్తింపబడ్డారు. జైపూరు, కలకత్తా వారణాసిలలో అనేకమంది శిష్యులున్నారు. భారతీయ ప్రాచీన సాంప్రదాయిక శాస్త్రాధ్యయనం ఎక్కడ జరిగినా శాస్త్రిగారుండవలసిందే మీమాంసా దర్శనంలో అపార వైదుష్యం, తార్కిక కౌశలం ఆర్జించిన విదుషీమణి మీమాంస మీద యాభై పాఠ్యగ్రంథాలు రచించారు మీమాంస, న్యాయమంజరి, అర్థ సంగ్రహం వంటి గ్రంథాలు వారి పాండిత్యానికి నికషోపలాలు మీమాంసా సూత్రాలను ఇతర శాస్త్రాలకు అన్వయించారు ప్రజాస్వామ్య దేశ నిర్మాణానికి మీమాంస ఉపయోగిత్వాన్ని చూపించారు ఇది శాస్త్రిగారి Unique Contribution

భారతీయ మహత్తర సంప్రదాయానికి సజీవ ప్రతీక శాస్త్రిగారు. ఆధునిక సంస్కృతి, ఆలోచనలను, ప్రాచీన సంస్కృతితో విలీనం చేసినవారు, ప్రాచీన ఋషులు తత్త్వవేత్తల ఆలోచనా ధారను, సరియైన వ్యాఖ్యానాలను అందించినారు.

వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు, దర్శనాలను మనకు సుబోధకంగా తెలియచెప్పిన పండితులు

భారతీయ సంస్కృతి వారసత్వ సంపదను సమగ్ర సుందరంగా అందించిన మహనీయుడు, పండితుడు పట్టాభిరామశాస్త్రి

వారి మరణం భారతీయ సంస్కృతికి, సంస్కృత భాషకు తీరని లోటు.

దక్షిణాది సంస్కృత పండితుడు ఉత్తర భారతంలోనే గాక జాతీయ స్థాయి గుర్తింపు పొందిన శాస్త్రిగారికి నివాళులర్పిస్తూ, సంస్మరిస్తూ, శ్రద్ధాంజలి ఘటిస్తూ ఈ వ్యాసం. 0₀0

## శ్రీరామ వచనములు

సంపాదకుడు : శ్రీ కపిలవాయి లింగమూర్తి, వాణీ ప్రచురణలు, నాగర్ కర్నూలు, ప్రతులకు: శ్రీ కె కిశోరుబాబు, 15-31, జీ సదనం, విద్యానగర్ కాలనీ, మహబూబ్‌నగర్ జిల్లా - 509 209, వెల రు 12/-

పూర్వము శతకములన్నియుఁ బద్యరూపమున వెలయింపఁబడినవి. శ్రీరామ వచనములు— అను ఈ కృతి వచనమున వ్రాయఁబడిన శతకమని చెప్పఁదగును. ఇది యీ కృతి యందలి వైలక్షణ్యము సాహిత్యారాధకుఁడైన శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు ఈ వచనములను ఉద్ధరించి లోకమునకు ఆవిష్కరించి మహోపకార మొనరించిరి. ఈ కృతికర్త యెవరో, యే కాలమువాఁరో తెలియదు ఈ మొత్తము రచన




యంతయు రామకథా సంబంధి గ్రంథము మాత్రమే లభించినది ఇంతవరకు అదృష్టమే ప్రాచీనులైన ఆంధ్రకవుల గ్రంథములనేకములు నేటికిని లభ్యము లగుట లేదు ఈ "వచనములు" కృతికూడ ఆద్యంత రహితముగా లభించి లింగమూర్తి చేతఁ బరిష్కృతమై సాహిత్యప్రియులకు పరితోష కారణమగుచున్నది. ఈయొక్క ప్రతికూడ లభించనిచో 'శ్రీరామ వచనములు' కావ్యము అవిజ్ఞాతమై కాలగర్భమునఁ గలిసి పోయి యుండెడిది. వాఙ్మయ చరిత్ర యందెచ్చటను గన్పడని యీ కృతిని సంపాదించిన మూర్తిగారు సుకృతులు. వారీ వచన కావ్యమునకు వ్రాసిన సంపాదకీయము వారి భాషా నైశిత్యమునకు, వైదుష్యమునకు నికషోపలము. సింహగిరి వచనములు వేంకటేశ్వర వచనములతోఁబాటు శ్రీరామ వచనములకుఁ గూడ సమాన ప్రతిష్ఠ కల్గించిన శ్రీ లింగమూర్తినిఁ బరిశోధన పరమేశ్వరులైన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి, బండారు తమ్మయ్య, మానవల్లి రామకృష్ణకవి ప్రభృతుల ప్రక్కన గూర్చొండఁబెట్టఁదగినవాఁడు ప్రాచీన పద్ధతిలోఁ దాళపత్ర గ్రంథసేకరణము పార పరిష్కారముచేసి సాహిత్యారాధన చేయుచున్న లింగమూర్తిగారిని ఆంధ్రదేశము కృతజ్ఞతాపూర్వకముగా గౌరవింపవలయును శ్రీరామ వచనములు నిత్య పారాయణ యోగ్యమయిన గ్రంథము

## శ్రీరామ రక్షాస్తోత్రమ్

వెల : 2/- ప్రతులకు : పురాణపండ రాధాకృష్ణమూర్తి భాగవత మందిరము, రాజమండ్రి-4

అద్భుత ఫలప్రదాయకమయిన శ్రీరామరక్షాస్తోత్రము కోటి ప్రతుల ప్రచురణ విశేష ప్రచారోద్యమ భాగముగా టీకా తాత్పర్య సమేతముగా ఈ ప్రతి తయారు చేయఁబడినది. పురాణపండవారి కుటుంబమున— "అచటఁ బుట్టిన చిగురు కొమ్మైన చేవ" యున్నట్లు ప్రతి వ్యక్తియు సంప్రదాయముపట్ల అభిమానము కలవాఁడు భక్తిప్రపత్తులు కలవాఁడు, దేశమున భక్తిభావములు ప్రచారము చేయుటకై అక్షరతపము చేయుచున్నవాఁడు. శ్రీ రాధాకృష్ణమూర్తిగారిట్టివారు ఈ శ్రీరామరక్షాస్తోత్రము సాధకునియందు భక్తి శ్రద్ధలను అంకురింపఁజేయును లౌకిక పారలౌకిక సుఖశాంతులను కల్గింపఁజేయును. కేవలము స్తోత్ర పారమునే ప్రకటించి యూరకొనక, ఆ స్తోత్రపారాయణ విధానమునుగూడ ప్రచురించి గురువు లిఖింప నేరని వారికి మహోపకారము చేసిరి శ్రీ బుధ కౌశిక విరచిత శ్రీరామ రక్షాస్తోత్రమునకు సరళమైన వ్యాఖ్య వ్రాసిన బ్రహ్మశ్రీ సామవేదం రామమూర్తిశర్మగారు కృతకృత్యులైనారు.

సమీక్ష

డాక్టర్ కాజ లక్ష్మీనరసింహారావు

ఎం.ఏ., పి.హెచ్.డి

# మంత్రబీజాక్షరాలు

——————పంచాంగము శేసప్ప శాస్త్రి

"మననాత్ త్రాయతే ఇతి మంత్రః" అని వేదవాక్యము నిరంతరమూ మననము చేయడము వలన మనము సంసార సాగరమునుండి తరించ గలము భక్తిని జ్ఞానాన్ని వైరాగ్యాన్ని కల్గించి, మాయావరణను దాటి మాధవత్వము పొందడానికి బీజాక్షరాలతో కూడిన మంత్రము సాధకునికి దోహదము చేయగలదు

బీజాక్షరమునందు – బీజమనగా విత్తనము. అక్షర మనగా నాశములేని స్థానము, బ్రహ్మ చైతన్య స్వరూపము నాశము లేని పదవిని పొందడానికి ఆత్మ చింతనావృతమైన భావాంకురానికి ప్రోద్బలము కల్గించేది విత్తనము. అనగా బీజాక్షరము గణముతో గుణముతో కూడి పరమార్థశబ్దముతో నిండి వుచ్చరించు సాధకునికి భగవదానంద ప్రాప్తినందచేయుచున్నది మంత్రమనగా రహస్యము తనలో తాను గుట్టుగా భగవన్నామాన్ని ఛందోనిబద్ధమైన బీజాక్షరములతో కలిపి జపించడము వలన మనస్సనే మలినావరణము నుండి దూరము కావడమే ముఖ్య ధ్యేయమైయున్నది. దైనందిన జీవితమునందు ఆహార నియమాలు వ్యవహారాలు పాటించి, కామినీ కాంచన తృష్ణను విస్మరించి, సర్వార్పణ భావనతో భగవదన్వేషణ చేయవలసి యున్నది. అప్పుడే అంతము లేని ఆనందసౌధమును సాధకుడు చేరగలడు.

కట్టుబాట్లు క్రమశిక్షణలు లేని వ్యవహార దృష్టికల మానవునికి వినిపించకుండా లౌకికుల కల్మష దృష్టికి కనిపించకుండా జపసాధనకుపయుక్తమయ్యే బీజాక్షరాలు భగవన్నామానికి పరిమాద్భుత శక్తి నొసంగి మంత్రముగా పరిణామము కల్గించుచున్నది.

శ్రీం, హ్రీం, క్లీం, గ్లౌం – గం – వంటి బీజాక్షరాలు గురించి వివరముగా పరమార్థ పరముగా అవగాహన చేసుకోవలసియున్నది. ఉదాహరణకు శ్రీం ఈ అక్షరమునందు శకారము అనంతమైన శుభము లందించేది రకారము అగ్నిబీజమై పాపవిమోచకమై యొప్పుచున్నది శ్రీం లోని యీం బీజము-జగన్మాతృ ప్రేమ తత్త్వానికి ప్రతీకయై విలసిల్లుచున్నది ఈ విధముగా శ్రీం బీజము లక్ష్మీప్రదమై శాశ్వతైశ్వర్యము లొసంగు శక్తి కల్గియున్నది. మిగతా బీజాక్షరలందు కూడ ఆయా శబ్దాలకు అద్భుతమైన మహిమోపేతమైన పరమార్థాలు సాధకునికి భగవదానందమందించే తత్త్వమున్నది.

బీజాక్షర మంత్రములుచ్చరించినపుడు-మన మనస్సుల్లో శరీరమునందు, రక్తాణువుల్లో – అవ్యక్తమైన, అనిర్వచనీయమైన ఆనందాన్ని ఆవేశాన్ని, సంచలన తత్త్వాన్ని సత్వరూపంగా అందించే చైతన్యము సంప్రాప్తమగుచున్నది. బాలభానుని కాంతి గోళాన్ని భావిస్తూ, మంత్ర బీజాక్షరాలు జపించి, అనంతమైన భగవదానందస్థాయికొరకు తపించి, లోకాన్ని విస్మరించి మాధవత్వమనే ఆనందసౌధాన్ని చేరుకోవడానికి సాధకుడు ప్రయత్నము చేయుటయే పరమ లక్ష్యంగా భావించి పురోగమించవలసియున్నది. ***

